# ఛాంపియన్ చిట్టి ఎంపిక



అద్భుతమైన ఎంపిక !
మైసూర్ శాండల్ సబ్బులో
చందనం, బాదం నూనెలు
ఉన్నాయి. సున్నిత
చర్మానికి అది చాలా
శ్రేష్ఠమైనది!




Almond oil moisturiser and antiseptic soap.



మైసూర్ శాండల్
సంస్థ గత 80 సంవత్సరాలకు
పైగా చందనం శ్రేష్ఠతను
మీ ఇళ్ళల్లోకి
తీసుకువస్తోంది.





PIRANHA



ACTIVE



CADET HX



YANKEE



ROBO COP

# Heroes start early.

Ride, race, take a tumble or even take a fall.
Because it's never too early to be a hero.



# పసివాడి అన్వేషణ!



"అమ్మా! మా నాన్నను గురించి గ్రామస్థులు చాలా గొప్పగా చెప్పుకుంటున్నారు. 'పన్నెండేళ్ళు ఇల్లు వదిలి వెళ్ళి ఎంత పెద్ద త్యాగం చేశాడాయన' అంటున్నారు. మా నాన్న ఎక్కడికి వెళ్ళాడు? ఎప్పుడు తిరిగి వస్తాడు?" అని అడిగాడు ఒక పసివాడు తన తల్లిని.

"మీ నాన్న ఆధ్వర్యంలో బ్రహ్మాండమైన దేవాలయ నిర్మాణం జరుగుతున్నది. అనేకమంది శిల్పకారులనూ, పనివాళ్ళనూ మీ నాన్న పర్యవేక్షిస్తున్నాడు. ఆ నిర్మాణం పూర్తికావడానికి ఇంకా ఎంతకాలం పడుతుందో ఏమో నాకు తెలియదు," అన్నది తల్లి.

పిల్లవాడు మౌనంగా కళ్ళు మూసుకుని కూర్చున్నాడు. వందలాది శిల్పులు తన తండ్రి పర్యవేక్షణలో దేవాలయ నిర్మాణానికి శ్రమిస్తూన్న దృశ్యం అతడి కళ్ళ ముందు కదలాడింది.

"అమ్మా, నేను అక్కడికి వెళతాను. మా నాన్నను చూడాలి. దయచేసి అనుమతించు," అన్నాడు పసివాడు.

"నాయనా! రాజాజ్ఞ ప్రకారం మీ తండ్రి ఈ గ్రామాన్ని వదిలి వెళ్ళిన ఒక నెల తరవాత నువ్వు పుట్టావు. ఆయన నిన్ను చూడలేదు. నువ్వు అక్కడికి వెళితే ఎలా గుర్తుపట్టగలడు?" అన్నది తల్లి అనుమానంగా.

"మా నాన్న నన్ను తప్పక గుర్తుపట్టగలడు. ఆయన నన్ను చూస్తే చాలా సంతోషిస్తాడు. ఆయన్ను చూడాలని నాకూ ఆశగా ఉంది," అని ప్రాథేయపడ్డాడు పసివాడు.



తల్లి ఆఖరికి బిడ్డ కోరికను కాదనలేక అనుమతించింది. తన భర్త ఇష్టంగా తినే పెరటిలోని చెట్టు పళ్ళను కోసి తెచ్చి మూటకట్టి ఆయనకివ్వమని బిడ్డచేతికిచ్చింది.

పసివాడు బయలుదేరి కొన్నాళ్ళకు ఆలయం నిర్మితమవుతూన్న స్థలానికి చేరుకున్నాడు. తండ్రి తనయుణ్ణి చూడగానే ఆనందబాష్పాలతో కౌగిలించుకున్నాడు.

ఆలయ గోపుర శిఖరం అమర్చే సూత్రం తెలియక తన తండ్రీ, సాటి శిల్పులూ సతమతమవుతూన్నట్టు పసివాడు గ్రహించాడు. ఆ విషయం గురించి తమ ఇంట్లో ఉన్న అరుదైన శిల్పగ్రంథంలో చదివి ఉండడంవల్ల వాడు ఆ సమస్యకు పరిష్కారమార్గం సూచించాడు. అతడి సూచనప్రకారం గోపుర శిఖర నిర్మాణం విజయవంతంగా పూర్తయింది.

---

## ప్రశ్నలు

1. పై ఉదంతంలో పేర్కొనబడిన దేవాలయం ఏది? అక్కడ కొలువబడే దేవుడు ఎవరు?

   ..........................................................................

2. పసివాడి పేరేమిటి? అతని తండ్రి పేరేమిటి? దేవాలయాన్ని నిర్మించిన రాజు ఎవరు?

   ..........................................................................

3. ఆంగ్లేయులు ఈ దేవాలయాన్ని ఏ పేరుతో పిలిచేవారు?

   ..........................................................................

ఈ క్విజ్‌లో 14 యేళ్ళకు లోబడిన పిల్లలే పాల్గొనాలి. ఖాళీ స్థలంలో మీ సమాధానాలను స్పష్టంగా రాసి కింద కనబరచిన కూపన్ నింపి మీ ఎంట్రీలను కింది చిరునామాకు పంపండి:

**Orissa Tourism Quiz Contest**
**Chandamama India Limited,**
**No.82, Defence Officers' Colony,**
**Ekkattuthangal, Chennai - 600 097.**

పేరు: .................................................. వయసు: ..................................

చిరునామా: .................................................. పిన్: ..................................




One winner picked by Orissa Tourism in each contest will be eligible for **3 days, 2-night** stay at any of the **OTDC Panthanivas**, upto a maximum of four members of a family. Only original forms will be entertained. The competition is not open to CIL and Orissa Tourism employees and their family members. Orissa Tourism, Paryatan Bhaven, Bhubaneswar-751 014. Ph: (0674) 432177, Fax: (0674) 430887, e-mail: ortour@sancharnet.in. Website: Orissa-tourism.com



## ఈ సంచికలో...




SUBSCRIPTION

For USA and Canada
Single copy $2
Annual subscription $20
*Remittances in favour of*
*Chandmama India Ltd.*
to
Subscription Division
CHANDAMAMA INDIA LIMITED
No. 82, Defence Officers Colony
Ekkatuthangal, Chennai - 600 097
E-mail: subscription@chandamama.org

చందా
ఎయిర్ మెయిల్ ద్వారా అన్నిదేశాలకు
పన్నెండు సంచికలు రూ: **900**
ఇండియాలో బుక్‌పోస్ట్ ద్వారా రూ. 120లు
చందా డబ్బు డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా
గాని, మనిఆర్డర్ ద్వారాగాని
'చందమామ ఇండియా లిమిటెడ'
పేరిట పంపండి.



ఈ పత్రికలో ప్రకటనల
కోసం సంప్రదించండి:

చెన్నయ్
ఫోన్ : 044-231 3637,
234 7399

ఢిల్లీ
మోనా భాటియా
ఫోన్:011-651 5111/
656 5513/656 5516

ముంబాయి
షకీల్ ముల్లా
మొబైల్ :98203-02880
ఫోన్ : 022-266 1599/266
1946/265 3057

© The stories, articles and designs contained in this issue are the exclusive property of the Publishers. Copying or adapting them in any manner/ medium will be dealt with according to law.



*Good news for young bookworms!*



**Hiya!** What has hit the animal world?
Listen hard and look keenly.
D'you hear the **jingle** of the **jungle**?

# JUNGLE JINGLES




A Set of five story books
with the whackiest and most
interesting collection of animal stories ever written.

Festival Offer!
**Rs. 50/- OFF**

From
CHANDAMAMA and Popular Prakashan

## DISCOUNT COUPON

Come into the enchanted world of JUNGLE JINGLES and avail a discount of Rs 50 on a set of five books on the cover price of Rs 200. Or you can get Rs 10 off on each title of Rs 40. Offer open for a limited period only. So hurry! Tick the titles you want.

- q The Itch to Fly and Other Stories
- q The Tiger with the Most Wonderful Tail and Other Stories
- q The Great Escape and Other Stories
- q The Donkey's Downfall and Other Stories
- q The Cunning Pelican and Other Stories

***Send your payment by DD or MO to:*** **Popular Prakashan Pvt. Ltd.,35-C M.M Malaviya Marg, Popular Press Building, Tardeo, Mumbai 400034. For enquiries contact sales@popularprakashan.com. Visit our site at www.popularprakashan.com**

హీరోస్ ఆఫ్ ఇండియా క్విజ్‌లో పాల్గొని ఆకర్షణీయమైన బహుమతులు గెలుచుకోండి!

# హీరోస్ ఆఫ్ ఇండియా – 15

ఆధునిక సాహిత్యరంగంలో సుప్రసిద్ధులైన కొందరిని గురించి ఇక్కడ ప్రస్తావించాము. వారిలో మీకు ఎందరు తెలుసో చూడండి.

**అన్నీ సరైన సమాధానాలు గల మూడు ఎంట్రీలు సైకిళ్ళను బహుమతులుగా అందుకుంటాయి!★**

1. 'వందేమాతరం' గీతం చోటుచేసుకున్న 'ఆనందమఠం' నవలను రచించాను. నాపేరేమిటి?

-----------------------------------------------

2. వాస్తవికతను రచనలలో ప్రవేశపెట్టిన తొలి హిందీ రచయితను. కథలలో సామాజిక స్పృహకు ప్రాధాన్యతనిచ్చాను. సేవాసదన్, గోదాన్ అనేవి ఉత్తమ రచనలుగా పేరు తెచ్చుకున్నాయి. నేనెవరిని?

-----------------------------------------------

3. నేను సుప్రసిద్ధ తమిళ రచయితను. 'చిత్తిరప్పావై' అనే నా నవలకు 1975 జ్ఞానపీఠ పురస్కారం లభించింది. నాపేరేమిటో తెలుసా?

-----------------------------------------------

4. స్వామి అండ్ ఫ్రెండ్స్, గైడ్, ది డార్క్‌రూమ్ మొదలైన కథలకు వేదికగా నిలిచిన 'మాల్గుడి' అనే ఊహాప్రదేశ సృష్టికర్తను నేను. నేనెవరో తెలుసా?

-----------------------------------------------

5. నేను ఋగ్వేదాన్ని మలయాళ భాషలోకి అనువదించాను. నాపేరేమిటి?

-----------------------------------------------

ప్రతి ప్రశ్నకు దిగువ చుక్కలతో చూపినచోట మీ సమాధానాలను స్పష్టంగా రాయండి. ఈ ఐదుగురిలో మీకు చాలా ఇష్టమైన రచయిత ఎవరు? ఎందుకు? అన్న విషయాలను పది పదాలకు మించకుండా రాయండి.

**నా అభిమాన రచయిత:**

..................................................................

..................................................................

పాల్గొనేవారి పేరు: ..............................................

వయసు:............తరగతి: ..........................................

చిరునామా:..........................................................

..................................................................

పిన్: ........................ ఫోన్: ..........................

పాల్గొనేవారి సంతకం: ......................

తల్లి/తండ్రి సంతకం:......................

వివరాలన్నీ పూర్తిగా నింపాక, ఈ పేజీ కత్తిరించి 2003 జనవరి 5వ తేదీలోగా అందేలా ఈ చిరునామాకు పంపండి:

హీరోస్ ఆఫ్ ఇండియా క్విజ్-15
చందమామ ఇండియా లిమిటెడ్
82, డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ
ఈకాట్టుత్తాంగల్, చెన్నయ్-600 097.

<u>సూచనలు:</u>

1. 8-14 ఏళ్ళ లోపు వయసు పిల్లలందరూ ఈ పోటీలో పాల్గొనవచ్చు.
2. ఈ పోటీకి వచ్చే అన్నిభాషల ఎంట్రీల నుంచి ముగ్గురు విజేతలు ఎంపిక చేయబడతారు. విజేతలు వారికి తగిన సైజు సైకిళ్ళు అందుకుంటారు. సరైన సమాధానాలుగల ఎంట్రీలు ఒకటికన్నా ఎక్కువ వచ్చినట్లయితే, నా అభిమాన హీరో వివరణ ఆధారంగా విజేతలు ఎంపిక చేయబడతారు.
3. న్యాయనిర్ణేతలదే తుది నిర్ణయం.
4. ఈ విషయంగా ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరుపబడవు.
5. విజేతలకు విషయాన్ని పోస్టుద్వారా తెలియజేస్తాము.

బహుమతులను మీకు అందజేస్తున్నవారు





వ్యవస్థాపకులు
బి.నాగిరెడ్డి - చక్రపాణి

# అందమైన జన్మభూమి!

జాతిని జాగృతం చేసిన ఆదిశంకరులు, స్వామి వివేకానంద, మహాత్మాగాంధీ మొదలైన మహనీయులు భారతదేశమంతటా పర్యటించినవారే. ఆసేతుహిమాచలం విస్తరించి ఉన్న మహోన్నత సాంస్కృతిక వారసత్వాన్ని వారు సందర్శించి, ప్రజానీకానికి గుర్తుచేసి స్ఫూర్తి కలిగించారు!

ఆదిశంకరులు శతాబ్దాల పూర్వం దేశం నలుదిశలకూ కాలినడకనే యాత్ర చేశాడని చెబుతారు. స్వామి వివేకానంద దక్షిణాగ్రంలోని సముద్రజలాల మధ్య బండమీద కూర్చుని ధ్యాన నిమగ్నుడై—తన ఎదుట ఉత్తరదిశగా విస్తరించిన సువిశాల భారతావనితో పాటు, అందులోని సమున్నత సనాతన ఆలోచనా స్రవంతిని స్మరించి—భారతజాతి పునరుజ్జీవనానికి బద్ధకంకణుడైన సంగతి అందరికీ తెలిసినదే!

జాతీయోద్యమానికి నాయకత్వం వహించిన మహాత్మాగాంధీ తన అహింసా సిద్ధాంతాన్ని ప్రచారం చేయడానికి దేశమంతటా ఊరూరూ పర్యటించి, ప్రసంగించిన విషయం మరిచిపోలేనిది!

పాఠశాల విద్యార్థులు విజ్ఞాన—వినోద యాత్రలకు వెళుతూ ఉంటారు. ఇది ఎంతైనా అవసరం. వివిధప్రాంతాల గురించీ, ప్రజల విభిన్న జీవన విధానాల గురించీ పుస్తకాలు, పత్రికలు, టీవీలు మొదలైనవాటిద్వారా తెలుసుకోవడంతో పాటు వీలైనప్పుడు ఆయా ప్రాంతాలకువెళ్ళి ప్రత్యక్షంగా చూడడం మంచిది. ఇలాంటి పర్యటనలు మనసుకు ఆహ్లాదం కలిగించడంతోపాటు మన దృక్పథాలను విస్తృతంచేసి, ఆలోచనా విధానాలను సుసంపన్నం చేస్తాయి.

ఈ సందర్భంలో భారత తొలి వ్యోమగామి రాకేష్ శర్మ అంతరిక్షం నుంచి పలికిన 'సారే జహా సె అచ్ఛా, హిందూస్థాన్ హమారా!' అన్న మాటలు గుర్తుచేసుకోతగ్గవి. భారతావని నిజంగానే అందమైనది. ప్రత్యక్షంగా చూడడంవల్ల అది మరింత అద్భుతంగా కనిపించి ఉంటుంది. ఏ ప్రదేశాన్నయినా ప్రత్యక్షంగా సందర్శించినప్పుడే దాని అందచందాలు పరిపూర్ణంగా తెలియవస్తాయి!

సంపాదకుడు : విశ్వం
Visit us at : http://www.chandamama.org



సుప్రసిద్ధం కాని సుందర ప్రదేశాలు:

# పిచ్చావరం

తమిళనాడులో సుప్రసిద్ధ నటరాజ దేవాలయం వెలసిన చిదంబర నగరానికి తూర్పుగా సముద్రతీరంలో ఉన్న సుందర వనప్రదేశం పిచ్చావరం. తమిళనాడుకు వస్తే ఇక్కడికి తప్పక రండి. ప్రకృతి శోభతో నిండిన ఈ ప్రశాంత ప్రదేశం పర్యాటకులను ఆహ్లాదం కలిగిస్తుంది.

పిచ్చావరం అడవిలో చాలా అరుదైన మాంగ్రోవ్ చెట్లు విస్తారంగా ఉన్నాయి. ఈ చెట్ల వేళ్ళు ఎప్పుడూ నీళ్ళలోనే ఉంటాయి. ప్రపంచంలోనే చాలా ఆరోగ్యకరమైన మాంగ్రోవ్ చెట్లు పిచ్చావరంలోనే ఉన్నాయని చెబుతారు.

సముద్రపు కాలువ జలాలతో చుట్టబడి 3,800 ఎకరాలలో విస్తరించి ఉన్న పిచ్చావరం అడవిలో చాలా దీవులు ఉన్నాయి. సముద్రం నుంచి ఈ అడవిని ఒక పెద్ద ఇసుకమేట (పర్ర) వేరు చేస్తున్నది. ఆ ఇసుకమేట కూడా అత్యంత మనోహరంగా కనిపిస్తుంది. వెళ్ళార్, కోల్‌రూన్ జలాశయాలు సముద్రపు కాలువతో కలవడంతో – పడవల షికారు, కాయకింగ్‌లాంటి జలక్రీడలకు చక్కటి అవకాశాలు ఏర్పడ్డాయి.

రెండువైపులా పచ్చటి వృక్షాలతో కమ్ముకున్న కాలువలూ, కొలనులూ, ప్రకృతి శోభను చూసి ఆనందించగలవారికి స్వర్గతుల్యంగా కనిపిస్తుంది.



ఏవిస్‌నియా, రిజోఫోరావంటి అరుదైన వృక్ష జాతులు ఇక్కడ కనిపిస్తాయి.

మీరు పిచ్చావరానికి వచ్చేప్పుడు కెమెరా, బైనాక్యులర్స్ తెచ్చుకోవడం మరిచిపోకండి. రకరకాల పక్షులను చూసి ఆనందించడానికి అన్నివిధాలా అనువైన ప్రదేశం ఇది. ఓదె కొంగలు, గూడ కొంగలు, తెడ్డుమూతి కొంగలు, చీకు బాతులు, దూడ బాతులు, అడవి బాతులు, నీటి కోళ్ళు, నారాయణ పక్షులు, వాటర్ స్నిప్స్, కార్మొరాంట్స్, ఎగ్రెట్స్ మొదలైన రకరకాల పక్షులు ఇక్కడ కనిపిస్తాయి.

పర్యాటకులు పడవలలో వెళ్ళి తిరిగి చూడడానికి వీలుగా తమిళనాడు పర్యాటకాభివృద్ధి సంస్థ పడవలను ఏర్పాటుచేసి ఉంది.

## ఇక్కడికి చేరుకోవడం ఎలా?

పిచ్చావరం చిదంబరానికి 16 కి.మీ. దూరంలో ఉంది. చెన్నయ్, మదురై, తిరుచ్చి మొదలైన నగరాలను కలుపుతూ చిదంబరానికి రైలుమార్గం ఉంది. అన్ని పట్టణాలకూ రోడ్డు రవాణామార్గ సౌకర్యం కూడా ఉంది. సమీపంలో ఉన్న విమానాశ్రయం తిరుచ్చి, చిదంబరం నుంచి వెళ్ళడానికి బస్సు, టాక్సీ, ఆటో సౌకర్యాలు అందుబాటులో ఉన్నాయి. పర్యాటకుల సౌకర్యం కోసం తమిళనాడు పర్యాటకాభివృద్ధి సంస్థ కాటేజీలు, రెస్టారెంట్లు ఏర్పాటు చేసి ఉంది.



# భూతదయ

కృష్ణానదీ తీరాన గుంటుపల్లి అనే గ్రామంలో, గంగయ్య అనే గుర్రపుబండివాడు వుండేవాడు. వాడు కాస్త పొగరుబోతు. పైగా, గ్రామం మొత్తానికి వాడిదొక్కటే గుర్రపుబండి కావడంతో, గ్రామాధికారినీ, ఇతర పెద్దలను కూడా వాడు లెక్క చేసేవాడు కాదు. మరొక గుర్రపుబండీ లేకపోవడంతో, ఇష్టమున్నా లేకపోయినా జనం కూడా వాళ్ళ అవసరాలకు వాణ్ణి పిలవక తప్పేది కాదు.

ఇలా వుండగా, గ్రామానికి దాపులనున్న నది నుంచి పంటకాలవ వచ్చింది. దానితో, ఎంతోకాలంగా బీడులుగా పడివున్న భూములు వ్యవసాయయోగ్యమయినై. గ్రామానికి కొత్త వాళ్ళు వచ్చి చేరడంతో జనాభా పెరిగింది. అవసరాలు పెరిగాయి. అందువల్ల, గంగయ్యకు పోటీగా మరి నాలుగు గుర్రబ్బళ్ళు తిరగడం మొదలైంది.

పొగరుబోతు ముద్రపడ్డ గంగయ్యకు క్రమేపీ బేరాలు రావడం తగ్గిపోయింది. వాడి కళ్ళఎదటే జనం, మరొకడి గుర్రబ్బండీని కుదుర్చుకుని వెళ్ళడు వాడిని చాలా బాధించింది. బేరాలు బాగా తగ్గిపోవడం వల్ల, వాడొక్కొక్క రోజు పస్తులు కూడా వుండేవాడు.

ఒక రోజున గంగయ్య మనశ్శాంతి కోసం గ్రామం నడిబొడ్డున వున్న శివాలయానికి వెళ్ళాడు. ఆ సమయంలో గుడి పూజారి, ఆలయానికి వచ్చిన కొందరు భక్తులతో, ''మంచి ప్రవర్తన, దయ, జాలిగుణాలను అందరూ పెంపొందించు కోవాలి. చేసే పని పట్ల శ్రద్ధ వలన, నిరంతర కృషి వలన – ఎవరైనా తన కార్యకలాపాలలో విజయం పొంది తీరుతారు,'' అని చెప్పాడు.

అనుకోకుండా, పూజారి మాటలు గగయ్య చెవిని పడ్డాయి. ఆయన ఇంకా ఏం చెపుతాడో విందామని వాడు మరికాస్త దగ్గరకు పోయి భక్తుల పక్కన నిలబడ్డాడు.

పూజారి తిరిగి మాట్లాడడం ప్రారంభించి, ''ఆలయానికి వచ్చినవాళ్ళు దైవదర్శనం చేసుకున్నాక, చిన్న బెల్లంముక్క నైనాసరే చీమలకు ఆహారంగా వుంచడం వలన, చాలా

మన్నవ మారుతీప్రసాదు

మేలు జరుగుతుంది. భోజనం చేసే ముందు కాకికి ఒక ముద్దఅన్నం గోడపైన పెట్టడంలాంటి జాలిగుణం వల్ల తప్పక మంచి జరుగుతుంది. ఎందువల్లనంటే, సృష్టిలో ప్రతిజీవీ ఆహారం కోసం ప్రయత్నిస్తుంది; దొరకకపోతే శుష్కిస్తుంది, శోకిస్తుంది. అందువల్ల, చీమలుగానీ, కాకులుగానీ మరే ఇతర జీవులయినా సరే – తమకు ఆహారం పెట్టినవారికి మేలు జరగాలని, వాటి వాటి స్థాయిలో సంకల్పిస్తాయి! అందువల్ల, మనిషి అన్నవాడికి భూతదయ అతిముఖ్యం," అన్నాడు.

పూజారి చెప్పిన బెల్లంగడ్డ విషయం అన్నిటికన్న గంగయ్య మనసుకు బాగా పట్టింది. వాడు గబగబా వెళ్ళి పచారికొట్లో ఒక అణాపెట్టి బెల్లంగడ్డ తెచ్చి దాన్ని శివాలయం పక్కనే వున్న మండపం మెట్లపైన ఒక మూలగా పెట్టి వీధిలోకి వచ్చాడు.

ఆ మరుక్షణం, "ఒరే, గంగయ్యా, ఆగు!" అన్న కేక విని వాడు వెనకకు తిరిగి చూశాడు.

ఆ కేకవేసింది మరెవరో సామాన్యుడు కాదు; గ్రామపెద్ద శివశంకరయ్య. ఆయన గంగయ్యతో, "సమయానికి కనిపించావురా అబ్బీ! నా చిన్నకూతుర్ని పొరుగూరి జంపన గ్రామం ఉన్నతపాఠశాలలో చదివించాలనుకుంటున్నాను. నువ్వు రోజూ నీ గుర్రబ్బండిలో దాన్ని తీసుకువెళ్ళి, తిరిగి తీసుకురావాలి. ఇందుగ్గాను నీకు నెలకు రెండువందల రూపాయలిస్తాను. గ్రామంలో ఎంతోకాలంగా గుర్రబ్బండీ తోలుతున్నవాడివని నీకు ప్రత్యేకంగా చెబుతున్నాను, తెలిసిందా! ఏమంటావు?" అని అడిగాడు.

గ్రామపెద్ద మాటలు వింటూనే గంగయ్యకు ఆశ్చర్యంతోపాటు చాలా ఆనందం కలిగింది. ఇంత త్వరగా బెల్లంగడ్డ మహిమ ఫలించడమూ, అనుకుంటూ వాడు, తన పాత పొగరుబోతుతనంగా కాక, శివశంకరయ్యకు రెండుచేతులూ జోడించి, "అలాగే, బాబూ!" అన్నాడు.

ఆనాటినుంచీ వాడు, ఒక్క చీమలకూ, కాకులకేకాక, ఆకలితో నకనకలాడుతూ, ఇంటిముందుకు వచ్చే కుక్కకు కూడా ఆహారం పెట్టసాగాడు. ఇది గమనిస్తున్న గ్రామస్థులు, వాణ్ణి పూర్వంలాగా పొగరుబోతు అని కాక మంచివాడుగా మారాడని భావించి, కేవలం బండికోసమే కాకుండా, తమ ఇళ్ళల్లో జరిగే శుభకార్యాలకు కూడా పిలవసాగారు.





# మాయాసరోవరం

## 11

[మాయాసరోవరాన్ని చేరటానికి, సర్పనఖుడి సహాయం అవసరం అని జయశీలుడు భావించాడు. అయితే, సర్పనఖుడు ముందుగా తన తమ్ముడు ఎక్కడ వున్నాడో తెలుసుకోదలిచాడు. నరవానరం యజమాని కృపాణజిత్తు కంటబడగానే, అతడు జలాశ్వం మీద వాడి వెంటబడ్డాడు. భయంతో పారిపోతున్న కృపాణజిత్తును మృత్యువృక్షం కొమ్మ ఒడిసి పట్టుకున్నది. తరవాత—]

మృత్యువృక్షం కొమ్మ ఒకటి కృపాణజిత్తు తల పట్టుకుని కొంచెం పైకి గుంజగానే, ఆ కొమ్మకు దాపులనున్న మరి రెండు చిన్న కొమ్మల్లో ఒకటి అతడి భుజాన్నీ, మరొకటి చేతినీ ఒడిసి పట్టుకుని చప్పున పైకిలాగినై. కృపాణజిత్తు వాటి పట్టును విడిపించుకునేందుకు కాళ్ళూ, చేతులూ ఆడిస్తూ, "రక్షించండి! రక్షించండి!" అంటూ అరవసాగాడు.

కృపాణజిత్తు ఆర్తనాదాలు విన్న మరుగుజ్జులెవరూ అతడికి సాయపడేందుకు ప్రయత్నించలేదు. ఏ పరిస్థితుల్లోనయినా సరే, మృత్యువృక్షాన్ని సమీపించటం అంటే వాళ్ళకు తగని భయం. జలాశ్వాన్ని మాత్రం మరుగుజ్జుల్లో కొందరు పారిపోకుండా పట్టుకున్నారు.

కొంచెం దూరంలో రాళ్ళగుట్ట మీద నిలబడివున్న జయశీలుడూ, సిద్ధసాధకుడూ, గుట్టదిగి పరుగు పరుగున మృత్యువృక్షం దగ్గిరకు వచ్చేలోపలే, సర్పనఖుడు జలాశ్వం మీద అక్కడికి వచ్చి, "నా తమ్ముడు ఎక్కడ వున్నదీ ఎరిగిన ఒక్కగానొక్కడూ చచ్చిపోతు



న్నాడు, కాపాడాలి!''అంటూ కృపాణజిత్తును పట్టుకున్న కొమ్మల్లో ఒకదాన్ని తన కత్తితో బలంగా కొట్టాడు.

ఆ దెబ్బకు మృత్యువృక్షం బోదె నుంచి, చివరి కొమ్మల వరకూ బలమైన గాలి తాకిడికి ఊగినట్టు ఊగిపోయింది. ఆ వెంటనే చిన్న మూలుగులాంటిది వినిపించింది. మరు క్షణం బొటనవేలంత లావుగల పొడవాటి కొమ్మ ఒకటి పాములా మెలికలు తిరుగుతూ కిందికి వంగి, సర్పనఖుడి మెడను చుట్టు కున్నది. సర్పనఖుడు, ''హా, మాయాసరో వరేశ్వరా, రక్షించు!''అంటూ కీచుమన్నాడు. జలాశ్వం బెదిరి ముందుకు పరిగెత్తింది.

జయశీలుడూ, సిద్ధసాధకుడూ ఒక్క దూకున అక్కడికి వచ్చారు. సిద్ధసాధకుడు సర్పనఖుడిరెండు కాళ్ళూ పట్టుకుని కిందికి లాగుతూండగా, జయశీలుడు కత్తి దూసి, సర్పనఖుడి మెడను చుట్టబెట్టిన కొమ్మను ఒక్క వేటున నరికాడు. సిద్ధసాధకుడు, సర్ప నఖుడి తల నేలకు కొట్టుకోకుండా, అతణ్ణి తలకిందులుగా ఎత్తి పట్టుకుని, ''ఒరే, నీటి పక్షి వెధవా! నువ్వుచేసిన దుస్సాహసం వల్ల, మాకు మాయాసరోవరానికి వెళ్ళే మార్గం చెప్పేవాడు లేకుండా పోయేవాడు!'' అంటూ సర్పనఖుణ్ణి కాళ్ళమీద నిలబెట్టాడు.

సర్పనఖుడు రెండు చేతులతో మెడ పట్టుకుని బాధగా ఒకసారి మూలిగి, ''నాకు తెలుసు, మాయాసరోవరేశ్వరుడు తన సేవ కులను ఆపదలనుంచి తప్పక కాపాడతాడు,'' అన్నాడు.

ఆ మాటలకు సిద్ధసాధకుడు కోపంగా పళ్ళు కొరికి, ''ఒరే, సర్పముఖం! ఇప్పుడు నిన్ను కాపాడింది నీ యజమాని అనుకుంటు న్నావా?'' అని అడిగాడు.

''స్వయానా ఆయన ఇక్కడికి రాకపో వచ్చు; కాని మీ ఇద్దర్నీ ఆవేశించి, నన్ను రక్షిం చాడు!''అంటూ సర్పనఖుడు తల ఎత్తి మృత్యు వృక్షం కేసి చూసి, అక్కడ కొమ్మల నుంచి వేళ్ళాడుతున్న కృపాణజిత్తు కంటబడగానే, ''హా, నా తమ్ముడు సర్పస్వరుడెక్కడ వున్నదీ తెలిసినవాడు చచ్చిపోతున్నట్టున్నది, రక్షిం చాలి!''అంటూ వృక్షం కేసి పరిగెత్తబోయాడు.

జయశీలుడు అతడి భుజం పట్టుకుని వెనక్కు లాగి, అక్కడ చేరిన మరుగుజ్జులతో, ''మీ సేనాని ఎక్కడ? ఇతగాడికి ప్రాణభయంతో మతిస్థిమితం తప్పింది. నదిలో నాలుగైదుసార్లు ముంచి, గట్టున ఎండ బెట్టండి,'' అన్నాడు.

మరుగుజ్జుసేనానీ, అతడి అనుచరులూ వచ్చి పట్టుకోగానే సర్పనఖుడు పెద్దగా కేక పెట్టి, ''నాకేం మతిస్థిమితం తప్పలేదు, అంతా



తెలుస్తూనే ఉన్నది! మీరు మరుగుజ్జులు; వాళ్ళు జయశీలుడూ, కాపాలికుడూ; అది మొసళ్ళ నది!'' అన్నాడు.

''ఒరే, నీటి మనిషీ, ఇక నోరు ముయ్యి. నిన్నామొసళ్ళకేఆహారంగా వేయబోతున్నాం,'' అంటూ మరుగుజ్జులు, సర్పనఖుణ్ణి నదీ జలంలోకి లాక్కుపోయారు.

ఆ సమయంలో అక్కడికి మరుగుజ్జురాణి తన రథం మీద వచ్చింది. గడెకొండా, అతడి అనుచరులూ చేతులు కట్టుకుని, తలలు వంచి రథం వెంట వున్నారు. రాణీని చూస్తూనే జయశీలుడు, ''మీ జాతి కలహాన్ని తనలాభం కోసం ఉపయోగించుకో చూసిన కృపాణ జిత్తును మృత్యువృక్షం బలి తీసుకున్నది. అందరూ హాయిగా బతకండి. ఇక మా దారిన మేం పోతాం. పోయేముందు ఈ మృత్యు వృక్షాన్ని అగ్నికి ఆహుతి చేయదలిచాం. ఇది ఏమరుపాటునవున్న చాలామంది ప్రాణాలను పొట్టన పెట్టుకుని ఉంటుంది,'' అన్నాడు.

''అయ్యా,అలాగేచేయండి. మీసహాయానికి చాలా కృతజ్ఞులం. ఆనరవానరు యజమాని అంతమయ్యాడు కాని, ఆ భయంకర వానరం మాత్రం ఇంకా ఈ అరణ్యాల్లోనేఎక్కడో తిరుగుతున్నది. రాత్రింబవళ్ళు మా జాగ్రత్తలో మేం వుండక, తప్పదు,'' అన్నది రాణి.

జయశీలుడు జాలిగా ఆమెకేసి చూసి, ''జలాశ్వాల మీద వచ్చినసర్పనఖుడనేవాడు మాకు దొరికాడు. వాడి తమ్ముణ్ణి ఆ నర వానరం ఎత్తుకుపోయింది. సర్పనఖుణ్ణించి మాకు సాయం అవసరం కనక, అతడి తమ్ముణ్ణి వెతికే ప్రయత్నంలో ఆ వానరం మాకు తటస్థ పడితే, దాన్ని చంపి తీరుతాం,'' అన్నాడు.

''దాన్ని చంపటం కాదు, మచ్చిక చేసి నేను వాహనంగా వాడుకోబోతున్నాను. నిప్పెక్కడ? మృత్యువృక్షాన్ని కాల్చి బూడిద చెయ్యాలి,'' అంటూ సిద్ధసాధకుడు చుట్టూ కలయ చూశాడు.

మరుగుజ్జుల్లో నలుగురైదుగురు భగ భగ మండుతున్న కాగడాలతో ముందుకు వచ్చారు. సిద్ధసాధకుడు వాళ్ళల్లో ఒకడి చేతి నుంచి కాగడా తీసుకుని, ''ప్రాణులను తిని బతికేది గనక, ఈ వృక్షంలో కొంత మాంస లక్షణాలూ, కొవ్వు లక్షణాలూ గల పదార్థం వుండకపోదు, ఈమండే కాగడాలు విసిరి చూద్దాం, ఏమవుతుందో!'' అంటూ కాగడాను చెట్టుకొమ్మల మీదికి విసరబోయాడు.

అంతలో చెట్టు వెనకనుంచి, ''ఆగు! పాపీ, చిరంజీవి మృత్యు వృక్షాన్నే బూడిద చేయదలిచావా? అది నీ వల్లనవునా?'' అన్న కేక వినిపించింది.




సిద్ధసాధకుడూ, జయశీలుడూ తలలు తిప్పి ఆ కేక వేసినవాడెవడా అని చూశారు. మామూలు మరుగుజ్జుజాతివాడయినా, వాళ్ళకన్న రెండు మూడంగుళాల పొడవు వున్న వాడొకడు, మెడలో పూసలూ, భుజాన గొడ్డలీ పెట్టుకుని – జుట్టు విరబోసుకుని, కుప్పి గంతులు వేస్తూ వచ్చి జయశీల, సాధకుల ముందు నిలబడ్డాడు.

సిద్ధసాధకుడు శూలంతో వాణ్ణి మృదువుగా తాకి చూసి, "ఎవడవురా నువ్వు? మహాకాళుడి భక్తుణ్ణయిన నన్నే, పాపి అనగలిగిన సాహసం నీకెక్కణ్ణించి వచ్చింది?" అని అడిగాడు.

ఆ వచ్చినవాడు నిర్భయంగా సిద్ధసాధకుడి ముఖంలోకి ఒక్క క్షణం చూసి, తరవాత చేయి ఊపుతూ, "నేనీ మహాశక్తివంతమైన చిరంజీవి మృత్యువృక్షం పూజారిని. ఇంతకు ముందు మీరు వృక్షాన్ని కత్తితో కొట్టినప్పుడు, అది పెద్దగా మూలగటం విన్నారు గదా?" అన్నాడు.

ఆ మాటలు వింటూనే జయశీలుడు, "చెట్టు వెనక వుండి అలా మూలిగింది నువ్వే కదా? నిజం చెప్పు," అని మెడపట్టుకున్నాడు.

పొట్టి పూజారి ఏమాత్రం తొణక్కుండా, "అవును, అలా మూలిగింది నేనే! కాని మూలగమని శాసించినది వృక్షాన్ని ఆవహించి వున్న మృత్యుదేవి. నేనామె పూజారిని, సేవకుణ్ణి," అన్నాడు.

జయశీలుడు, ఇప్పుడు వీణ్ణి ఏం చేద్దాం అన్నట్టు సిద్ధసాధకుడికేసి చూశాడు. సాధకుడు పొట్టిపూజారి భుజాన వున్న గొడ్డలిని తన చేతిలోకి తీసుకుని, "ఒరే, జిత్తులమారి పొట్టి వెధవా! ఈ నాటితో మృత్యువృక్షానికి ఆయువు తీరిపోయినట్టే. దాని పూజారివైన నీ ఉద్యోగం కూడా పోయింది. చేతిలో గొడ్డలి వున్నది గనక, అరణ్యంలో ఎక్కడైనా కట్టెలు కొట్టుకుని బతుకు. అమాయక జీవుల ప్రాణాలు బలిగొనే మృత్యువృక్షం కాలి బొగ్గు కాబోతున్నది," అంటూ భగభగ మండుతున్న కాగడాను చెట్టు కేసి విసరబోయేంతలో, పొట్టి పూజారి ఎగిరి అతడి చేయి పట్టుకున్నాడు.

"దుర్మార్గుడా, ఈ మహాకాలుడి భక్తుణ్ణే తాకేంత దుస్సాహసం చేస్తావా?" అంటూ సిద్ధసాధకుడు పూజారిని విదిలించాడు.

పొట్టి పూజారి అంతదూరాన పోయి పడి లేచి, "అయ్యా, ఈ మృత్యువృక్షం దుర్మార్గుల్నీ, మోసకారుల్నీ తప్ప ధర్మపరుల్ని చంపదు," అన్నాడు.

అప్పుడు జయశీలుడు చప్పునముందుకు పోయి పొట్టిపూజారిని పట్టుకుని, "నువ్వు



ధర్మపరుడివేగదా?ఎన్నడూఎలాంటి మోసాలూ చేసినవాడివి కాదు, అవునా?''అని అడిగాడు.

''అయ్యా, అందుకు సందేహమా?'' అన్నాడు పొట్టి పూజారి.

పూజారి ఇలా అనగానే జయశీలుడు అతణ్ణి పైకెత్తి, మృత్యువృక్షం కేసి విసిరి వేయబోయాడు. పూజారి ఒక చావుకేక పెట్టి, ''అయ్యా, నన్ను వదలండి. భయంకర మరణంపాలు చేయకండి,'' అంటూ గడగడ వణికిపోసాగాడు.

జయశీలుడు నవ్వుతూ అతణ్ణి నేల మీదికి దించి, ''సాధకా, ఇక ఇక్కడ మనం కాలం వృథా చెయ్యటం ఎందుకు? మృత్యువృక్షానికి నిప్పు పెట్టు,'' అన్నాడు.

సిద్ధసాధకుడు మరుగుజ్జుల చేతుల్లో నుంచి మండుతున్న కాగడాలు తీసుకుని వృక్షం బోదె కేసి, కొమ్మల మీదికి విసిరాడు. మరుక్షణం నూనెలో తడిపిన ఎండుకట్టెలా మృత్యువృక్షం ముట్టుకుని, పెద్దమంటలతో, పొగలతో కాలిపోసాగింది.

జయశీలుడు చెట్టు కొమ్మల నుంచి వేళ్ళాడుతున్న కృపాణజిత్తు శవంకేసి చూసి, ''వీడు అమరావతీ నగర రాజుగారి అశ్వదళ నాయకుడు. ఒక జూదగృహంలో వీడికీ, నాకూ వచ్చిన తగూ మూలంగానే, నేనిలా అరణ్యాల పాలు కావలసి వచ్చింది. దుర్మార్గుడికి మంచి చావు దుర్లభం! అదే జూదశాలలో నా మిత్రుడైన దేవశర్మ అనే అతనుండేవాడు. అతనూ దేశాలు పట్టి పోయాడు. ఎక్కడ తిరుగుతున్నాడో ఏమో!'' అన్నాడు.

''మనం మాయాసరోవరాన్ని చేరి, హిరణ్యపురం రాజుగారి పిల్లల్ని బంధవిముక్తుల్ని చేసే లోపల, అతడూ మనకెక్కడో తటస్థపడక పోడు,'' అన్నాడు సిద్ధసాధకుడు.

''అవును, సాధకా! నీ మాటలు వింటూంటే, నాకూ నమ్మబుద్ధవుతున్నది. సర్పనఖుడెక్కడ?'' అంటూ జయశీలుడు చుట్టూ కలయచూశాడు.

సర్పనఖుడు ఒక జలాశ్వాన్ని ఎక్కి దూరంగా వున్న కొండలకేసి చూస్తూ, ఏదో దీర్ఘంగా యోచిస్తున్నాడు. జయశీలుడు అక్కడ వున్న రెండవ జలాశ్వాన్ని సిద్ధసాధకుడికి చూపుతూ, ''సాధకా, ఈ అశ్వాన్ని వృథాగా ఇక్కడవదలటం ఎందుకు? మనలో ఎవరో ఒకరం ఉపయోగించుకోవచ్చుగదా?'' అన్నాడు.

''జయశీలా, ఆ జలాశ్వం నీదే. నేను కాలి నడకన నిన్ను అనుసరించగలను. ఆ భయంకర నరవానరం నా కంటబడితే, దాన్ని క్షణాల మీదమచ్చికచేసి వాహనంగా చేసుకుంటాను,'' అన్నాడు సాధకుడు.

"సాధకా, నువ్వన్నంత పనీ చేయగలవు. సరే, ఇక బయలుదేరదామా?" అని జయశీలుడు అక్కడ వున్న రాణీ, గడెకొండలతో పాటు మిగతా మరుగుజ్జులందరినీ ఉద్దేశించి, "మీ ప్రబల శత్రువైన కృపాణజిత్తు, అదుగో కాలిపోతున్న మృత్యువృక్షంతో పాటు బూడిద అయిపోతున్నాడు. ఇక మీకు వచ్చిన భయం ఏమీ లేదు. సుఖంగా జీవించండి, ఇక మా దారిన మేం పోతాం," అన్నాడు.

జయశీలుడు ముందు జలాశ్వం మీదా, కొంచెం వెనకగా సిద్ధసాధకుడూ బయలుదేరేసరికి, మరుగుజ్జుజాతి వాళ్ళందరూ, జయజయధ్వానాలు చేశారు. అది విన్న సర్పనఖుడు చప్పున తల తిప్పి, దూరంగా పోతున్న జయశీల, సిద్ధసాధకులను కేకవేసి పిలుస్తూ, "జయశీల, సిద్ధసాధకులారా, కొంచెం ఆగండి! నా తమ్ముడి కోసం వెతకాలి గదా, నేనూ వస్తున్నాను," అంటూ తన అశ్వాన్ని వేగంగా వాళ్ళదగ్గరకు పరిగెత్తించాడు.

జయశీలుడు అతణ్ణి ఒకసారి పరీక్షగా చూసి, "నదీ స్నాను నీకు మేలు చేసినట్టున్నది. ఇక నీ దారిన నువ్వు పోవచ్చు. మేం మాయా సరోవరం ఎక్కడ వున్నదో వెతికి తెలుసుకుని, దాని యజమానిని ముక్కలుగా నరికి, నీటి పక్షులకూ, జంతువులకూ ఆహారంగా వేయబోతున్నాం," అన్నాడు.

ఆ మాటలకు సర్పనఖుడు ముఖం అయిష్టంగా పెట్టాడే తప్ప, జవాబేమీ ఇవ్వలేదు. తరవాత ముగ్గురూ ఒక అరగంట కాలం అరణ్యంలో ప్రయాణించి, లోగడ జయశీలుడూ, సిద్ధసాధకుడూ జలపాతం నుంచి నదిలో పడిన ప్రాంతాన్ని చేరారు.

జయశీలుడు పూర్వం తమకు ఆ ప్రాంతాల కలిగిన అనుభవం గురించి సర్పనఖుడికి చెప్పబోయేంతలో, సర్పనఖుడు చేయెత్తి కొంచెం దూరంలో వున్న కొండగుహల్లో ఒక దాన్ని వాళ్ళకు చూపుతూ, "ఆ గుహలో నుంచి తొంగి చూస్తున్న భయంకర మృగం నరవానరం కాదా?" అన్నాడు.

"అవును, నరవానరమే!" అంటూ జయశీలుడు ఆశ్చర్యపోయేంతలో నరవానరం భయంకరంగా అరుస్తూ, గుహనుంచి బయటికి దూకింది. ఆ మరుక్షణం పెద్దగా ఘీంకరిస్తూ, మకరకేతు వాహనమైన జలగ్రహం గుహ నుంచి వెలువడి, నరవానరాన్ని తొండంతో వడిసి పట్టుకున్నది. —(ఇంకావుంది)





బేతాళ కథలు

# భానుమంతుడి కథ

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, ఎంతటి సాహసి వైనా, భీతిగొలిపే ఈ శ్మశాన ప్రాంతంలో ఇంత నిర్భీతిగా సంచరిస్తున్న నిన్ను చూస్తూంటే, నీ విజయం పట్ల ఎంత ప్రగాఢమైన నమ్మకంతో వున్నావో బాగా తెలుస్తున్నది. అయితే నమ్మకాలు అన్నివేళలా ఫలవంతం కావన్న సంగతి, నీకు తెలిసి వుండకపోవచ్చు. వెనకటికి నీలాగే తిరుగులేని నమ్మకంతో, సాక్షాత్తూ మహారాజుతో పోటీకి దిగిన ఒక గిరిజన యువకుడు, తాను గెలిచి



కూడా ఫలితాన్ని చేజేతులా జారవిడుచుకున్నాడు. ఆ యువకుడి కథ నీకు కనువిప్పు కలిగించవచ్చు! చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం వింధ్యాటవీ ప్రాంతంలో గల అనేక చిన్న చిన్న రాజ్యాల్లో, శోణపురి రాజ్యం ఒకటి. ఆ దేశపు రాజు తీరని వ్యాధితో మరణించడం వల్ల, అతడి ఏకైక కుమారుడు భానుమంతుడు చాలా చిన్నవయసులోనే రాజయ్యాడు. వయసు చిన్నదైనప్పటికీ సహజంగా మేధావీ, రాజనీతిజ్ఞుడూ అయిన భానుమంతుడు, అచిరకాలంలోనే రాజ్య వ్యవహారాలనూ, దేశపరిస్థితులనూ ఆకళింపు చేసుకుని, విజ్ఞుల సలహాలను స్వీకరిస్తూ, స్వబుద్ధితో పాలన సాగించాడు.

ఇలావుండగా ఒకనాడు రాజోద్యోగి, భానుమంతుడితో మాట్లాడుతూ, ''మన దేశానికి తూర్పు, ఉత్తరపుటెల్లలు రెండూ దట్టమైన వింధ్యాటవీ ప్రాంతాలేనన్న విషయం మీకు తెలియందికాదు. నేనా ప్రాంతాల నుంచి వచ్చి, మీ తండ్రిగారి దయవల్ల, ఆస్థానంలో ఉద్యోగినయ్యాను. నేను ఇంతకు ముందు చెప్పిన ఉత్తరారణ్యం ప్రకృతి సౌందర్యానికి పేరెన్నికగన్నది. అంతే కాదు; అక్కడ కనిపించేటంత ఎక్కువ జాతుల వన్య ప్రాణులు కూడా మరెక్కడా కనిపించవు!'' అని చెప్పాడు.

ఆ మాటలు వినగానే, వేటపట్ల అమితాసక్తిగల భానుమంతుడికి, వెంటనే ఉత్తరారణ్యం వెళ్ళాలన్న కోరిక కలిగింది. అతడు, కొద్దిపాటి పరివారాన్ని మాత్రం వెంటబెట్టుకుని ఉత్తరారణ్యానికి బయలుదేరాడు. అరణ్యం చేరుకున్నాక, అక్కడ వన్యప్రాణులతోపాటు గిరిజనులు కూడా కనిపించారు, భానువంతుడికి. వాళ్ళెవరు, ఏమిటి అన్న అతడి ప్రశ్నలకు, వెంటవచ్చిన వారిలో కేవలుడు అనేవాడు జవాబిస్తూ, ''వీళ్ళు లక్ష్మణ జాతి గిరిజనులు, మహారాజా! మామూలు గిరిజనులకంటే వీరిలో చదువు సంస్కారాలు అధికం. పూర్వం శ్రీరామచంద్రుడు, సీతాదేవి కోసం లంక దిశగా పయనిస్తూ, ఈ అరణ్య మార్గంగానే ప్రయాణించాడట! అప్పుడు ఇక్కడ నివసించే గిరిజనులు, ఆయనను ఎంతో భక్తిపురస్సరంగా సేవించగా, చాలా ఆనందించి, మీరంతా లక్ష్మణుడికి సాటి రాగలవారంటూ, వారిని ఆదరించాడట! అప్పటి నుంచీ వీరి జాతికి లక్ష్మణజాతి అనే పేరు వచ్చింది. ఈ జాతిలో ఇంకో విశేషం ఏమంటే, ఇక్కడ క్రూరజంతు బాధ అధికం గనక, ఈ జాతి స్త్రీలు కూడా ఆయుధ ప్రయో

గులో మంచి నైపుణ్యం సాధిస్తారు,'' అంటూ వివరించాడు.

భానుమంతుడు ఆసక్తిగా కేవలుడి మాటలు విన్నాడు. తర్వాత కొద్దిసేపట్లోనే అతడు అటువైపు వచ్చిన ఒక అడవిదుప్పి మీద బాణం వేశాడు. దుప్పి బాణం దెబ్బ తప్పించుకుని ఘెంగున ముందుకు దూకింది. అంతలో మరొకవైపు నుంచి బాణం ఒకటి సర్రున శబ్దం చేస్తూ వచ్చి దుప్పి శరీరానికి తగిలింది. దుప్పి బాధగా అరిచి కిందపడి విలవిల తన్నుకోసాగింది.

కళ్ళ ముందు కనిపించిన ఆ అద్భుత దృశ్యానికి ఆశ్చర్యపోతూ, భానుమంతుడు గుర్రాన్ని నిలిపివేసి అలాగే వుండిపోయాడు. అంతలో ఒక నల్లని గుర్రం మీద స్వారీ చేస్తూ, ఒక లక్ష్మణజాతి యువతి దుప్పిని సమీపించింది.

ఆ యువతిని చూడగానే భానుమంతుడు మరింత ఆశ్చర్యపోయాడు. గిరిజనులకు సంప్రదాయకమైన వేషభూషల్లో వున్నప్పటికీ, ఆమె సౌందర్యం, మసిపూసిన మాణిక్యంలా ప్రకాశిస్తూనే వున్నది.

దుప్పి సమీపంలో గుర్రం దిగిన ఆ యువతి, భానుమంతుణ్ణి గమనించి, ఒక క్షణం తబ్బిబ్బు పడి, వెంటనే తేరుకుని వినయంగా నమస్కరించింది. తర్వాత జరిగిన సంభాషణలో ఆమె లక్ష్మణజాతి నాయకుని కుమార్తె చంపాలత అని తెలుసుకున్న భానుమంతుడు, ఆమె ఆహ్వానంపై వాళ్ళింటికి బయలుదేరాడు.

భానుమంతుడు రాకకెంతో ఆనందించిన చంపాలత తండ్రి, తమవద్ద రెండు రోజుల పాటు ఉండమని మరీమరీ కోరటంతో, భానుమంతుడు అక్కడ వుండిపోయాడు. ఆ






రెండు రోజుల్లోనూ చంపాలత సుమధుర గానం, మృదుభాషణ, ఆమె తెలివితేటలు భానుమంతుణ్ణి మరింతగా ఆకర్షించాయి. అతడు సమయం చూసుకుని, ఆమెను వివాహమాడాలన్న కోరికను వెలిబుచ్చాడు.

చంపాలత తల వంచుకుని, ''ప్రభూ! భగవంతుడు నా మనోగతాన్నే మీ ద్వారా వినిపించాడు. అది నా అదృష్టమే! కానీ, మా మేనత్త కొడుకు రాముడు, నన్ను పెళ్ళాడాలని చాలా పట్టుదలగా ఉన్నాడు. నాకు తప్ప మిగిలినవారందరికీ కూడా, మా పెళ్ళి ఇష్టమే. మా ఆచారం ప్రకారం ఒక కన్యను ఒకరికంటే ఎక్కువ మంది వివాహమాడగోరితే, వారిలో వారికి పోటీ జరుగుతుంది. మా రామాలయంలో గల పురాతనమైన విల్లును, ఎవరైతే సునాయాసంగా ఎక్కుపెట్టగలరో, వారే ఆ కన్యను వివాహమాడాలి. నన్ను కోరుకుంటున్నారు గనక, ఇప్పుడు మీకూ, రాముడికీ పోటీ తప్పదు. రాముడు స్వతహాగా బలహీనుడు; పైగా అవిటివాడు కూడా. దైవ లిఖితం ఎలా వుందో!'' అంటూ నిట్టూర్చింది.

భానుమంతుడు, ఆమె మాటలకు చిరునవ్వు నవ్వి, ''సరే, చూద్దాం ఏం జరుగుతుందో!'' అన్నాడు.

ఆమర్నాడు పోటీ ఏర్పాటయింది. చుట్టూ చేరినవారందరూ ఆశ్చర్యంతో చూస్తూండగా, రాముడు విల్లుకు నమస్కరించి, వంగి దాన్ని ఒక్క ఉదుటున పైకెత్తి నారిని సంధించాడు. చంపాలత వాడిపోయిన ముఖంతో భానుమంతుడికేసి చూసింది.

భానుమంతుడు, రాముడికేసి చూస్తూ నవ్వి, ''రామా! నువ్వు విజయం సాధిస్తావని నాకు తెలుసు. కాని, ఒక్కసారి అటుచూడు! ఎవరికోసమైతే నువ్వు, ఈ విజయం సాధించావో, ఆమె నీ విజయం పట్ల సంతోషం కనబరుస్తున్నదా? గమనించు!'' అన్నాడు.

ఆ మాటలతో అప్రయత్నంగా చంపాలత వైపు తిరిగిన రాముడు, ఆమె ముఖంలో వ్యథ గమనించి, ఒక్కసారిగా నీరు కారిపోయాడు. తర్వాత, నెమ్మదిగా భానుమంతుడి దగ్గరకు వచ్చి, నమస్కరిస్తూ, ''నా తప్పు నాకు తెలిసింది. నన్ను క్షమించి, మా చంపను రాణిగా చేసుకోండి,'' అన్నాడు.

భానుమంతుడు ఆ మాటలకు నవ్వుతూ రాముడి భుజం తట్టి, చంపాలత తండ్రివైపు తిరిగి, ''ఇది కలియుగం! త్రేతాయుగం నాటి మహిమలను తలచుకుంటూ మూఢ నమ్మకాలు పెంచుకోవడం మేలు కలిగించదు. మీ అనుచరుల మధ్య కాలానుగుణమైన న్యాయం పెంపొందేలా చూడటం, మీకర్తవ్యం!

ఇక నుంచి వరుడి మంచి చెడ్డలు విచారించి, కన్య సమ్మతిని అనుసరించి, వివాహాలు జరిపించండి!'' అని, విల్లును సమీపించి, ఒక చేత్తో దాన్ని అలవోకగా ఎత్తి దూరంగా విసిరి వేశాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, భాను మంతుడి ప్రవర్తన రాజునన్న అహంభావంతో కూడినది కాదా? అవిటివాడైనప్పటికీ ఆత్మ విశ్వాసంతో విజయాన్ని సాధించిన రాముణ్ణి, ఆయన ఉచితరీతిని గౌరవించలేదు. తానేమీ తప్పు చెయ్యకుండానే రాముడు, తన తప్పు తెలుసుకున్నానంటూ కోరి అపజయాన్ని స్వీక రించటం, రాజుపట్ల భయంవల్లనే గదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పక పోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''భానుమంతుడు చెప్పినట్టు, అసలు లక్ష్మణజాతివాళ్ళ ఆచా రమే దురన్యాయంతో కూడుకున్నది. కన్య అభీష్టంతో పనిలేకుండా వివాహం జరిపించ టంచాలా అన్యాయం. అటువంటి దురా చారాన్ని ఒక్క ఆజ్ఞాపనతో రద్దుచేయగలిగి వుండీ ఆ పని చేయక, ప్రత్యక్షంగా ఆ దురా వారం వల్ల కన్యలు ఎంత బాధపడేదీ చూపించి, సామోపాయంతో దాన్ని రద్దుచేసిన భాను మంతుడి ప్రవర్తన ఎంతో ధర్మబద్ధమైనదీ, హుందా అయినదీ తప్పితే, అహంభావపూరిత మైనది ఎంతమాత్రం కాదు. ఇక రాముడి విషయానికొస్తే—చంపాలతకు తానంటే ఇష్టం లేదని తెలిసీ, ఆమె ఇష్టాయిష్టాలను లక్ష్యపెట్టక, పట్టుదలతో తన విజయం పట్ల తిరుగులేని నమ్మకాన్ని ఏర్పరచుకుని, విజయాన్ని సాధించాడు. రాజు భానుమం తుడు మృదువుగానే అయినా స్పష్టంగా చెప్పిన మాటలతో, తన తప్పు తెలుసుకుని క్షమాపణ కోరుకున్నాడు. గిరిజనుల్లో వున్న ఆ దురాచారాన్ని తొలగించటమే తన లక్ష్యంగా పెట్టుకున్న రాజు, రాముడి మాటలతో ఆ లక్ష్యాన్ని సాధించినట్టే! అయినా, గిరిజనుల్లో తన శక్తిసామర్థ్యాలపట్ల, ఏమాత్రమూ అను మానం కలగగూడదన్న దూరాలోచనతోనే, ఆయనవిల్లునుసునాయాసంగా ఎత్తిదూరంగా విసిరివేశాడు,'' అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. –(కల్పితం)

[ఆధారం: లక్ష్మీగాయత్రి రచన]



మన పూర్వగాథలు: 8

# తండ్రికి విముక్తి కలిగించిన తనయుడు!



ఏకపాదుడు జ్ఞానసంపన్నుడైన ముని. ఆయన బ్రహ్మముహూర్తంలో లేచి, నదిలో స్నానం చేసి వచ్చి వేదమంత్రాలను పారాయణం చేసేవాడు. స్వరయుక్తంగా ఆయన మంత్రాలను పఠించడం చెవిని పడగానే అటు వెళ్ళేవారు అలాగే నిలబడి కొంతసేపు ఆగి విని మరీ వెళ్ళేవారు. ఏకపాదుడి భార్య సుజాత కూడా ఆయన వల్లించే వేదమంత్రాలను భక్తిశ్రద్ధలతో ఆలకించేది. ఆమె కొన్ని నెలల గర్భిణిగా ఉన్నది.

ఒకనాడు ముని యథాప్రకారం వేదపారాయణం చేస్తూండగా, ''ఆహా!'' అని ఎవరో సంతోషంతో ఆశ్చర్యపోతున్నట్టు చిన్న శబ్దం వినిపించింది. తన కుటీరం పక్కగా వెళుతున్న వారెవరో మెచ్చుకుని వెళ్ళి ఉంటారని ముని అనుకున్నాడు. ఆయన వేదపారాయణాన్ని మనసారా అభినందించే మునులు ఆ ముని వాటికలో పలువురు ఉన్నారు.

రెండుమూడుసార్లుఅప్పుడప్పుడూ అలాంటి కంఠస్వరం వినిపించింది. ముని దానిని అంతగా పట్టించుకోలేదు. అయితే, ఒకనాడు అదే కంఠస్వరం–వేదమంత్రాల ఉచ్చారణలో దోషం ఉన్నట్టు సూచించి, ఎలా ఉచ్చరించాలో చెప్పడం విని ముని ఉలిక్కిపడ్డాడు. ఆశ్చర్యంతో లేచి లోపల, బయట, చుట్టుపక్కల కలయచూశాడు. భార్య సుజాత తప్ప, కంఠస్వరం వినిపించేంత దూరంలో వేరెవ్వరూ కనిపించలేదు.

''ఇప్పుడు మాట్లాడింది ఎవరు? నీపేరేమిటి? ఎక్కడున్నావు?'' అంటూ ముని గట్టిగా ప్రశ్నించాడు. దానికి సమాధానం రాలేదు. అదే ప్రశ్నను ఆయన ఏడుసార్లు అడిగాడు. అయినా సమాధానం రాలేదు. మునిలో ఓర్పుసన్నగిల్లింది. ''నా వేదపారాయణాన్ని తప్పుపట్టి వక్రంగా పలికినవాడెవడు? వెంటనే నా ఎదుటికిరా! నువ్వు మానవ మాత్రుడివా? అతీత శక్తివా? ఎంతకూ

బిందుసార్

రావేమిటి? రావా? నేను ఇంతవరకు ఎనిమిది సార్లు అడిగినా నువ్వెవరో చెప్పలేదు. నీ వక్రమైన చర్యకు సమాధానం చెప్పలేదుగనక నీ శరీరం ఎనిమిది వంకరలైపోవుగాక!'' అని శపించాడు.

ఆ తరవాత కొన్నాళ్ళకు భార్య ప్రసవకాలం సమీపిస్తుండడంతో, ఏకపాదుడు కుటుంబ పోషణకు జనకమహారాజు వద్ద ధనం అర్థించడానికి బయలుదేరాడు.

ఆ సమయంలో జనకమహారాజు కొలువులో వరుణపుత్రుడైన వంది అనే సుప్రసిద్ధ పండితుడు వేదాంతచర్చ సాగిస్తూ, తనతో వాదానికి రమ్మని పండితులను పందానికి పిలుస్తున్నాడు. వాదంలో తనను ఓడించిన వారికి విలువైన బహుమతులు ఇస్తాననీ; తనచేత పరాజయంపాలైనవారు జలగర్భ కారాగారంలో జీవితాంతం గడపాలనీ విచిత్ర నిబంధనలను విధించాడు వంది!

ఏకపాదుడికి తన వేదాంత పరిజ్ఞానం, వాదనా పటిమపట్ల అపార విశ్వాసం ఉంది. అందువల్ల వందితో వాగ్వివాదానికి అంగీకరించాడు. అయితే వంది ఆయన్ను వాదంలో ఓడించి జలగర్భ కారాగారానికి పంపాడు.

అక్కడ మునిపత్ని కొన్నాళ్ళకు ఒక మగ శిశువును ప్రసవించింది. అయితే ఆ బిడ్డ శారీరకంగా ఎనిమిది వంకరలు కలిగిఉన్నాడు. తల్లి గర్భంలో ఉన్నప్పుడే, తండ్రివేదపారాయణం విని ఆ బిడ్డ వేదజ్ఞానాన్ని సముపార్జించాడు. గర్భస్థ శిశువుగా ఉన్నప్పుడే తండ్రి వేదపారాయణంలో తప్పు పట్టినవాడూ, ఆ కారణంగా తండ్రిశాపానికి గురైనవాడూ ఆ బిడ్డడే! శరీరంలో ఎనిమిది వంకరలు కలిగి ఉండడంవల్ల ఆ బిడ్డకు అష్టావక్రుడని నామకరణం చేశారు.

తన భర్తకు పట్టిన దుర్గతికి విలపిస్తున్న సుజాత, అంగవైకల్యంతో పుట్టిన బిడ్డను చూసి మరింత విషాదం చెందింది. అయితే, బిడ్డ పెరిగేకొద్దీ అద్భుతమైన తెలివితేటలతో, ఆ ప్రాంతంలోని వేదపండితులందరినీ మించే పాండిత్యాన్ని ప్రదర్శించసాగాడు.

పన్నెండేళ్ళ ప్రాయంలో అష్టావక్రుడు జనక మహారాజు ఆస్థానానికి బయలుదేరాడు. గర్వాం



ధుడైన వందిని మించిన పండితులున్నారని ప్రపంచానికి చాటాలన్న దృఢనిశ్చయంతో అక్కడికి చేరాడు.

జనకుడి ఆస్థానంలోని పండితులు, మహా పండితుడైన వందితో వాదించడానికి సిద్ధపడిన పసివాణ్ణి వింతగా చూడసాగారు. ఆ పసివాడి శరీరంలాగే వాడి మనసులో సైతం ఏదైనా వైకల్యం ఉండవచ్చని కొందరు భావించారు. అయితే, వివేకసంపన్నుడైన జనకమహారాజు మాత్రం ఆత్మవిశ్వాసం తొణికిసలాడే ఆ పసి వాణ్ణి చూడగానే బాలమేధావియై వుంటాడని గ్రహించాడు. వందితో వాదించడానికి అతన్ని అనుమతించాడు.

వంది, అష్టావక్రుల మధ్య వాగ్వివాదం ఆరంభమయింది. మితిమించిన గర్వంతో వాదాన్ని ప్రారంభించిన వంది క్రమంగా పసి వాడి వాదనాపటిమనూ, తెలివితేటలనూ, తర్క చాతుర్యాన్నీ గ్రహించసాగాడు. పసివాడు తర్కంతో తనను మళ్ళీమళ్ళీ అధిగమిచడం చూసి హడలిపోయాడు. పసివాడి అసమాన వేదపాండిత్యం,తర్కపటిమ, వివేకం, సమయ స్ఫూర్తి, వాక్చాతుర్యం, వినయం చూసి సభ లోని పండితులు ముగ్ధులయ్యారు. వంది కన్నా మునికుమారుడు అన్నివిధాలా ఉత్తము డని నిర్ణయించారు. అఖరికి వంది తన ఓట మిని అంగీకరించాడు.

"వాదంలో గెలుపొందినందుకు నీకేంబహు మతికావాలి నాయనా?" అని అడిగాడు జనకుడు.

"మొదట నా తండ్రినీ, అయనలాగే వాదంలో వందితో గెలుపొందలేక చెరసాలపాలైన పండి తులందరినీ విడుదల చేయాలి!" అన్నాడు అష్టావక్రుడు.

వెంటనే ఏకపాదుణ్ణీ, ఇతర పండితులనూ విడుదల చేశారు.

ఏకపాదుడు జలగర్భ కారాగారంలో ఉన్న ప్పుడు–ధ్యానంతో, యోగాభ్యాసంద్వారా మరిన్ని శక్తులు సముపార్జించాడు. కుమారుణ్ణి ఆప్యా యంగా కౌగిలించుకుని దీవించి, వెళ్ళి నదిలో స్నానంచేసి రమ్మన్నాడు. అతడు వెళ్ళి నదిలో మునిగి లేవగానే అతని శరీరంలోని వంకర లన్నీ మటుమాయమయ్యాయి. అందమైన బాలుడిగా నడిచి వచ్చాడు. రాజు ఇచ్చిన కానుక లను పుచ్చుకుని, తండ్రిని వెంటబెట్టుకుని తల్లి దగ్గరికి బయలుదేరాడు.

క్రమేణా అష్టావక్రుడు గొప్ప వేదపండి తుడుగా కీర్తి గడించాడు. పండితుల ప్రశంస లను పొందిన 'అష్టావక్ర సంహిత' అనే సుప్ర సిద్ధ గ్రంథాన్ని రచించాడు.






## వానల కోసం!



రుతుపవనాలు రాక, ఇక వానలు లేవు, కరువు కాటకాలు తప్పవు అనే పరిస్థితిలో వరుణ జపాలు, పూజలు చేయడం మన దేశంలో అక్కడక్కడ ఆనవాయితీ. అదే కోవలో ఒరిస్సా గ్రామ ప్రజలు 'బెంగే నాని నచా' అనే 'కప్ప నాట్యం' జరుపుతారు. దీన్ని చేయడం వల్ల వాన కురుస్తుందని వాళ్ళ నమ్మకం. మొదట ఒక కప్పను పట్టి నీళ్ళకుండలో వేస్తారు. ఆ తరవాత కుండను, ఒక వెదురుగడకు మధ్యగా కట్టి దానిని ఇద్దరు పట్టుకుని ముందు నడుస్తారు. వాళ్ళ వెనక గ్రామ ప్రజలు పిల్లలతో కలిసి నాట్యం చేస్తూ వెళతారు. ఊరేగింపు గ్రామదేవత ఆలయాన్ని చేరుకున్నాక అక్కడ ప్రత్యేక పూజలు జరిపిస్తారు. ఆ తరవాత కుండలోని కప్పను దాపులనున్న కొలనులోనో, ఏటిలోనో వదిలి పెడతారు.

## మాయా మయోంగ్!

చేపను బాగా కడిగి వేయించి, పులుసులో ఉడికించి, వడ్డించడానికి తెచ్చిపెట్టాం. అప్పుడు ఆ చేపకు ప్రాణం వచ్చి పులుసులో హుషారుగా తిరుగుతూ కనిపించిందంటే – భోజనం చేయడానికి కూర్చున్న అతిథుల పరిస్థితి ఎలా ఉంటుంది? అస్సాం నౌగాంగ్ జిల్లాలోని మయోంగ్ గ్రామ మాంత్రికుల మాయాజాల విద్యను గురించి తెలియజేసే కథలలో ఈ ఘట్టం ప్రముఖంగా కనిపిస్తుంది. ఒకానొకప్పుడు ఈ గ్రామంలో గొప్ప గొప్ప మాంత్రికులు ఉండేవారని చెబుతారు. మధ్యయుగాలకు చెందిన కొన్ని కథలు – అస్సాంపై దండెత్తి వచ్చిన సైనికులు సైతం మంత్రశక్తి కారణంగా మాయమైపోయేవారని చెబుతాయి.





# సత్తిగాడి కోరిక

కోటీశ్వరులైన భూపతి, భానుమతులకు, వివాహం అయినఇరవైఏళ్ళవరకూ సంతానం కలగలేదు. పొరుగూరి వెంకటేశ్వర ఆలయంలో స్వామికి కళ్యాణం చేయించాక, భానుమతి గర్భం ధరించి, మగపిల్లవాడిని కన్నది. తెల్లవారితే, ఆ పిల్లవాడి మూడవ పుట్టినరోజు.

"రేపు ముందుగా వెంకటేశ్వరస్వామి ఆలయంలో అర్చనచేయించి వద్దాం," అన్నది భానుమతి, బాబును నిద్రపుచ్చుతూ.

"ఒక్క రేపనే కాదు, బాబు ప్రతి పుట్టిన రోజునా, ఆ స్వామిని దర్శించుకుని రావాలి!" అన్నాడు భూపతి.

భార్యాభర్తలు తెల్లవారగానే స్నానాలు చేసి, గుర్రపుబండిలో పొరుగూరు బయలు దేరారు. భూపతి కుటుంబానికి పూర్ణ కుంభంతో స్వాగతం పలికారు అర్చకులు. బాబు పుట్టగానే స్వామికి బంగారు కిరీటం చేయించాడు భూపతి.

అర్చన జరుగుతూండగా బయట ఏదో కలకలం వినిపించింది. తల్లిదండ్రులు కళ్ళు మూసుకుని పూజలో వుండగా, పిల్లవాడు బయటకు వెళ్ళి, కోనేరులో కలువపూలు చూసి,మెట్లు దిగిపోయి కాలుజారి అందులో పడిపోయాడు. ఆ సమయంలో కోనేరు మెట్లమీద గుడ్డ పరుచుకుంటున్న బిచ్చగా డొకడు, చప్పున నీళ్ళలోకి దూకి పిల్లవాడిని కాపాడాడు.

సంగతి తెలుసుకున్న భానుమతి, కొడుకును గుండెలకు హత్తుకుని కళ్ళనీరు పెట్టుకున్నది. భూపతి, ఒకపక్కగా తడిసిన పంచెను పిండుకుంటున్న, ఆ బిచ్చగాడి దగ్గరకు వెళ్ళి, "మా బాబుకు పునర్జన్మ ప్రసాదించిన నీ మేలు ఈ జన్మకు మరవను!

మాచిరాజు కామేశ్వరరావు

నీ పేరేమిటి? నీకేం కావాలో అడుగు,'' అన్నాడు.

''అయ్యా, నా పేరు సత్యం; అందరూ సత్తిగాడని పిలుస్తారు. నేను అంతగా చేసిందేమీ లేదు. అడుక్కునే నా బొచ్చె నీళ్ళల్లో పడినా, అలాగే దూకి తీసేవాడిని,'' అన్నాడు సత్తిగాడు.

''అయినా, నా సంతోషం కోసం ఏదైనా కోరుకో,'' అన్నాడు భూపతి.

సత్తిగాడు కాస్సేపు ఆలోచనలో పడి, ''నాకు జీవితంలో కనీసం ఒక్కరోజయినా, పదిమందీ గౌరవించే విధంగా గొప్పగా బతకాలని వుంది. అందుకు మీరు అవకాశం కల్పించండి, చాలు!'' అన్నాడు.

''అలాగే, సత్యం! ఇప్పుడే మాతోపాటు బండెక్కు. మాగ్రామానికి వెళదాం,'' అన్నాడు భూపతి సంతోషంగా.

భూపతి కొడుకు పుట్టినరోజు కావడంతో అనేకమంది వ్యాపారస్థులూ, మిత్రులూ శుభాకాంక్షలు తెలియజేయడానికి, ఆయన ఇంటికి రావడం ప్రారంభించారు.

ఆసరికే భూపతి, సత్తిగాడిచేత విలువైన దుస్తులు ధరింపజేశాడు. వచ్చినవారందరికీ ఆయన సత్తిగాణ్ణి చూపుతూ, ''ఈయన సత్యం, నా చిన్ననాటి స్నేహితుడు. పట్నంలో పేరుమోసిన వ్యాపారి,'' అంటూ గొప్పగా పరిచయం చేశాడు.

మెత్తటి పట్టుపరుపులు అమర్చిన దివానుల మీద, సంపన్నుల మధ్య కూర్చోవడం–అంతా కలలా తోచింది సత్తిగాడికి. ఆ సాయంత్రం గొప్పవిందు జరిగింది. గ్రామంలోని ధనికు



లందరూ కుటుంబాలతో ఆడంబరంగా వచ్చారు.

వాళ్ళు భూపతి పక్కనే వున్న సత్తిగాడిని, భూపతితో సమానంగా గౌరవించారు. వాళ్ళల్లో కొందరు, ''సత్యంగారూ! మీరు తప్పక ఒకసారి మా ఇంటికి వచ్చి వెళ్ళాలి, మరిచిపోవద్దు,'' అంటూ సత్తిగాడిని తమ ఇళ్ళకు ఆహ్వానించారు.

అంతా సద్దుమణిగేసరికి అర్ధరాత్రి అయింది. సత్తిగాడు, భూపతి ఇచ్చిన దుస్తులు విడిచి, తన దుస్తులు ధరించి, అటుగా వచ్చిన భూపతికి నమస్కరించి, ''అయ్యా, నా జీవితకాలపు కోరిక, మీ దయ వల్ల తీరింది. ప్రతివారూ నన్ను ఒరేయ్, ఏరా, అంటూ అమర్యాదగా పలకరించేవారే. అందువల్లనే, జీవితంలో ఒకసారయినా అందరూ నన్ను గౌరవించాలనీ, మనిషిగా

చూడాలనీ ఆశపడేవాడిని. నా కోరిక తీరింది. ఇప్పుడు నేనెంతో సంతోషంగా ఉన్నాను. ఇక, వెళతాను!'' అన్నాడు.

భూపతి నవ్వి, ''అందరూ నిన్ను నీచంగా ఎందుకు చూస్తున్నారో తెలుసా?'' అని ప్రశ్నించాడు.

''మరేం లేదు, బిచ్చగాడిననీ!'' అన్నాడు సత్తిగాడు.

''అయితే, నే చెప్పే నాలుగు మాటలూ శ్రద్ధగా విను,'' అంటూ భూపతి, సత్తిగాడి భుజం తట్టి, ''నీకేజబ్బూ లేదు, ఎలాంటి అంగవైకల్యం లేదు. నువ్వు కష్టపడి సంపాయించుకోక అడుక్కుతినడం దేనికి? అందరూ గౌరవంగా చూడాలని గుడిమెట్ల మీద జోలె పరుచుకుని కలలు కనకపోతే, కష్టంచేసి సంపాయించుకోవచ్చు కదా! నువ్వు అడుక్కు తింటున్న ఖర్మానికి భిక్ష వేయనివాడు కూడా ఛీ, పోరా, అంటాడు. అవునా?'' అన్నాడు.

ఆ మాటలలో వున్న వాస్తవాన్ని గ్రహించిన సత్తిగాడు, ''మీ మాట నిజమే. అయితే, నాకు పని ఎక్కడదొరుకుతుంది!'' అన్నాడు దీనంగా.

''అలాంటి కుంటిసాకులు చెప్పకు. నువ్వు నిజంగానే చేస్తానంటే పని నేను ఇస్తాను. రేపే వచ్చి నా బట్టల దుకాణంలో చేరు,'' అన్నాడు భూపతి.

''అలాగే, బాబూ! తప్పకుండా వస్తాను,'' అంటూ అక్కడి నుంచి ఆనందంగా వెళ్ళి పోయాడు సత్తిగాడు.

పక్క గదిలోంచి, ఈ సంభాషణ అంతా విన్న భానుమతి, భూపతితో, ''మన బంగారు బాబుకు ప్రాణభిక్ష పెట్టిన, ఆ దేవుడిలాంటి వాడికి, దుకాణంలో ఏదో చిన్నపని ఇచ్చి చేతులు దులుపుకుంటారా? అతడికి పది లక్షలు ఇచ్చినా, అతడి ఋణం తీరినట్టు కాదు!'' అన్నది కాస్త ఆవేశంగా.

ఆమాటలను భూపతి పెద్దగానవ్వి, ''అలా ఆవేశపడక, నేచెప్పేది విను. ముందుగా, ఏళ్ళతరబడి సోమరిగా బతికిన, అతడిలోని బద్ధకాన్ని పోగొట్టాలి. అతడు అంతో ఇంతో కష్టం చేయడానికి అలవాటుపడ్డాక, ఆ బట్టల దుకాణం అతడికే ఇచ్చేద్దాం. స్వయంగా కష్ట పడకుండా, వాళ్ళా వీళ్ళా మీద ఆధారపడే వాడు వ్యాపారంలో పైకి రాలేడు; సంపద నిలుపుకోలేడు,'' అన్నాడు.

భర్త ముందుచూపుకు మనస్ఫూర్తిగా అతడిని మెచ్చుకున్నది, భానుమతి.



# చందమామ కబుర్లు

## దిక్కు తోచని నాలుగు నెలలు!




వియత్నాం నుంచి అమెరికాలో స్థిరపడిన పెద్దమనిషి అరవైరెండేళ్ళ రిచర్డ్ వాన్ ఫామ్. ఒకనాడు ఆయన రోజంతా సముద్రంలో ప్రయాణం చేయాలని కాలిఫోర్నియా లాంగ్ బీచ్ నుంచి పడవలో ఒంటరిగా బయలుదేరాడు. అయితే మధ్యాహ్నానికల్లా ఆయన దిక్కుతోచక సముద్రంలో దారి తప్పాడు. అలా నాలుగు నెలల పాటు ఒంటరిగా పడవలో ఎక్కడెక్కడో తిరగసాగాడు. ఆఖరికి అమెరికా నౌకాదళానికి చెందిన యుద్ధనౌక, అతడు బయలుదేరిన చోటికి 4000 కి.మీ. అవతల కనిపించిన అతన్ని కాపాడింది. ఇంతకూ ఈ నాలుగు నెలలూ ఆయన ఏం తిని ఎలా ప్రాణాలు నిలుపుకున్నాడా అని ఆశ్చర్యపోతున్నారు కదూ! పడవ తెరచాప కొయ్యను ఎరలను కట్టి, వాటిని తినడానికి వచ్చే తాబేళ్ళనూ, చేపలనూ, పక్షులనూ పట్టి తింటూ ప్రాణాలు నిలుపుకున్నాడు!

## కుజగ్రహానికి ఎలుకలు!

భూమిమీదా, ఆకాశంలో ఎన్నో పరిశోధనలు, ప్రయోగాలు జరుగుతున్నప్పటికీ మనిషి ఎప్పుడు కుజగ్రహానికి వెళ్ళగలడో ఈనాటికీ తెలియడం లేదు. శాస్త్రవేత్తలు వేస్తున్న ప్రస్తుత లెక్కల ప్రకారం కుజగ్రహాన్ని చేరుకోవడానికి ఏకధాటిగా ప్రయాణం చేస్తే ఆరు నెలలు పడుతుంది. అయినా, భూమి మీదికన్నా 38 శాతం తక్కువ ఆకర్షణశక్తి గల కుజగ్రహం మీద మనిషి నివసించగలడా అని తెలుసుకోవడానికి శాస్త్రవేత్తలు తీవ్రంగా పరిశోధనలు జరుపుతున్నారు. అమెరికాలోని మాసాచుసెట్స్ సాంకేతిక సంస్థతో కలిసి ఆస్ట్రేలియా, అమెరికా దేశ పరిశోధకులు కుజగ్రహానికి 2003 ప్రాంతంలో ఎలుకలను పంపాలని ప్రతి పాదిస్తున్నారు. కుజగ్రహ వాతావరణంలో ఎలుకలు ప్రాణాలతో నిలబడ గలిగినట్టయితే మనిషి కూడా అక్కడ జీవించగలడు!





# ఇద్దరూ ఇద్దరే!

రంగాపురంలోని భూషయ్యకు పెద్దజబ్బు చేసి తగ్గింది. గాలిమార్పు కోసం కొన్నాళ్ళు సీతాపురంలో వుండి రమ్మని వైద్యుడు చెప్పాడు. భూషయ్య ఆ ప్రకారం సీతాపురంలోని దూరపుబంధువుల ఇంటికి వెళ్ళి వున్నాడు. బంధువుల ఇంట భూషయ్యకు చక్కని ఆదరణ లభించింది.

ప్రతిరోజూ సాయంత్రం చల్లని గాలిలో నడుచుకుంటూ సంతకు వెళ్ళేవాడు, భూషయ్య. అక్కడ దానిమ్మపండ్లు కొనేవాడు. కాలినడక, దానిమ్మపండ్లు ఆయన ఆరోగ్యానికి ఎంతో అవసరమని వైద్యుడు చెప్పివున్నాడు.

భూషయ్యకు ఏ రోజూ చక్కని దానిమ్మ పళ్ళు దొరికేవి కాదు. కొన్నిటికి డాగులుండేవి. కొన్ని ఇంటికి వెళ్ళాక వలిచి చూస్తే, సగంపైన గింజలు కుళ్ళి వుండేవి. అప్పటికీ భూషయ్య పళ్ళను ఎంతో కష్టపడి ఏరుకునేవాడు. ఒక రోజు కొన్నవాడివద్ద మళ్ళీ కొనేవాడు కాదు.

అలా వారం రోజులు గడిచాక ఒకరోజు సాయంత్రం సంతలో తిరుగుతూంటే, "ఊరికి కొత్తవాణ్ణి; పళ్ళనాణ్యతను మాత్రం కాదు. నా దగ్గర ఒకసారి పళ్ళు కొంటే ఇంకెప్పుడూ నా దగ్గరే కొంటారు!" అంటూ అరుస్తున్న ఒక యువకుడి వద్దకు వెళ్ళాడు భూషయ్య. తర్వాత వాణ్ణి చిరాగ్గా చూసి, "అంతా ఇలాగే అంటారు. కానీ పచ్చి మోసం," అంటూ ఆయన వాడికి తన అనుభవం చెప్పాడు.

"అదంతా నాకు తెలియదు, బాబూ! వ్యాపారమంటేనే నమ్మకానికి మరొక పేరు అనుకుంటాను నేను. మంచిసరుకు తెస్తాను, ఒక్కటే ధర చెబుతాను, ఒక్కసారికి నావద్ద కొని చూడండి," అన్నాడా యువకుడు.

"వసుంధర"

భూషయ్య ఆ యువకుణ్ణి పేరడిగి ఈశ్వరుడని తెలుసుకున్నాడు. చూడ్డానికి వాడిదగ్గర దానిమ్మపళ్ళు బాగున్నా, బేరం ఒప్పుకోలేదు. అలాగే పళ్ళలోంచి ఏమీ ఏరుకోనివ్వలేదు.

''సరుకంతా మంచిదే బాబూ! ఈ ఒక్క రోజుకూ నన్ను నమ్మండి. రేపటి నుంచి ఎలాగూ మీరు నన్నే నమ్ముతారు,'' అన్నాడు ఈశ్వరుడు.

భూషయ్య వాడి మాటలను ఆకర్షితుడయ్యాడు. అదీకాక, ఇంతవరకూ నమ్మకమైన పళ్ళదుకాణంవాడు దొరకలేదు కూడా!

నిజంగానే ఈశ్వరుడిచ్చిన పళ్ళు బాగున్నాయి. ఇంట్లో బంధువులు కూడా ఆయనిచ్చిన పళ్ళుతిని, అంత రుచికరమైన దానిమ్మ పళ్ళను తాము ఆ ఊరు దుకాణాల్లో ఎరగమని చెప్పారు. మర్నాటినుంచి భూషయ్య రోజూ ఈశ్వరుడి దగ్గరే పళ్ళు కొనడం కొనసాగించాడు. ఈశ్వరుడు కూడా ఆయునకు చెడ్డసరుకన్నది ఇవ్వలేదు.

అలా నెల రోజులు గడిచాయి. ఆసరికి భూషయ్య ఆరోగ్యం ఎంత మెరుగయిందంటే - జబ్బు చేయడానికి పూర్వం కూడా లేని మెరుపిప్పుడు ఆయనలో కనబడుతున్నది. ఇక రంగాపురం తిరిగివెళ్ళే సమయం వచ్చిందని ఆయన అనుకున్నాడు.

ఆ రోజే భూషయ్యకు సీతాపురంలో చివరి రోజు. తనకు చక్కని పండ్లనిచ్చిన ఈశ్వరుడి వద్ద వీడ్కోలు తీసుకోవాలని ఆయన అనుకున్నాడు. సాయంత్రం ఈశ్వరుడి దుకాణానికి వెళ్ళి చూస్తే, వాడి దగ్గర సరుకు చూడ్డానికేమీ బాగాలేదు.



''అలా కనబడుతున్నది కానీ బంగారం లాంటి సరుకు, బాబూ! తటపటాయించకండి. తమర్ని మోసం చేస్తే, రేపు మళ్ళీ నా దగ్గరకు రారుకదా!'' అని, ఈశ్వరుడు పళ్ళు తూకం వేస్తూంటే, ఆ పళ్ళకు ఎప్పటిధర ఇవ్వడానికి మనస్కరించని భూషయ్య, ''అనుకోకుండా దారిలో ఒక ఎరిగున్నాయన అప్పడిగితే ఇచ్చేశాను. జేబులో ఆట్టే డబ్బు లేవు. అన్నిపళ్ళు తూకం వెయ్యకు,'' అన్నాడు.

''తమదగ్గర డబ్బులేమైపోతాయ్, బాబూ! ఎంతవుంటే అంతే ఇవ్వండి. మిగతాది రేపు చూసుకుందాం,'' అన్నాడు ఈశ్వరుడు.

''అదైనా సరుకు బాగుంటేనే,'' అన్నాడు భూషయ్య. సరుకెందుకు బాగుండదన్నట్లు నవ్వేశాడు, ఈశ్వరుడు.

తాను ఊరు విడిచిపోతున్నట్లు ఈశ్వరుడికి చెప్పాలని భూషయ్యకు నాలుక చివరిదాకా

వచ్చింది. కానీ ఆ రోజు వాడిచ్చిన పళ్ళమీద ఆయనకు చాలా అనుమానంగా వుంది. అందుకని, సరుకు బాగుంటేనే బంధువు లింట్లో మిగతా డబ్బిచ్చి వెళ్ళాలనీ, లేకుంటే ఆ డబ్బు ఎగవేయాలనీ అనుకున్నాడాయన. ఈ ఆలోచనతో, ఈశ్వరుడు అడిగిన దాంట్లో సగం డబ్బే ఇచ్చి పళ్ళు తీసుకుని ఇల్లు చేరాడు, భూషయ్య. ఆ రాత్రి వలిచి చూస్తే ఏ పండూ బాగోలేదు.

"ఈ పళ్ళకుగాను ఇప్పటికి ఈశ్వరుడి కిచ్చిందే ఎక్కువ. వాడికింక మిగతాడబ్బు ఇవ్వక్కర్లేదు!" అనుకున్నాడు భూషయ్య.

ఈశ్వరుడు తన గురించి ఏమనుకుం టాడో అన్నదానికంటే, వాడు అబద్ధం చెప్పి తనను మోసం చేశాడనే భూషయ్య ఎక్కువ బాధపడ్డాడు.

మర్నాడుదయమే రంగాపురం వెళ్ళే గుర్రబ్బండి ఎక్కాడు, భూషయ్య. అందులో ఆయనతో పాటు మరి ముగ్గురున్నారు. భూషయ్య బండిలో వెనుకగా కూర్చున్నాడు. దారిలో బండిని ఎవరో ఆపారు.

"నడచి వెళదామనుకుంటే కాలు బెణి కింది. రంగాపురం ఇవతల గౌరీపురంలో దిగ పోతాను. అంతగా డబ్బిచ్చుకోలేను. నన్ను కాస్త నీ ముందుగా నీ పక్కనే కూర్చోని స్తావా?" అని వచ్చినవాడు బండివాడిని అడుగుతున్నాడు.

ఆ మాటలు విని పరిచయమైన గొంతులా వుందే, అనుకున్నాడు భూషయ్య.

"ఇంత మాట్లాడావు- ఇంతకూ నువ్వె వరివో చెప్పావుకాదు!" అన్నాడు బండివాడు కాస్త విసుగ్గా.

"నా పేరు ఈశ్వరుడు. సీతాపురంలో పళ్ళవ్యాపారం చేశాను. మా ఊళ్ళో పళ్ళతోటలు చూడమంటూ, భూస్వామి ఒకాయన కబురు పెడితే, సీతాపురం వదిలి వెళ్ళిపోతున్నాను," అన్నాడు వాడు.

భూషయ్య తల తిప్పి వాణ్ణి చూశాడు. అప్పుడే ముందునుంచి బండెక్కుతున్న ఈశ్వ రుడూ తల తిప్పి, భూషయ్యను చూశాడు. ఇద్దరూ క్షణం మాత్రమే ఒకరినొకరు అలా చూసుకున్నారు.

దానిమ్మపళ్ళు బాగాలేవని భూషయ్య అనలేదు. బాకీ డబ్బులిమ్మని ఈశ్వరుడూ అడగలేదు. ఇద్దరూ ఇద్దరే కదా మరి!





# వెయ్యి వరహాల మూట

చంపానగరంలో దొంగతనాలు ఎక్కువయ్యాయి. కొత్వాలు ధనసేనుడు దొంగలతో చేతులు కలపడం వల్ల, ఫిర్యాదులు రాజుకు చేరడం లేదని పుకారు పుట్టింది. ఆ పుకారులోని నిజానిజాలు తెలుసుకునేందుకు, రాజు మారువేషం వేసుకుని, రాత్రిపూట నగర సంచారం చేస్తూ, ఒక సత్రంలో బస చేశాడు.

"నీ దగ్గర డబ్బేమైనా వుంటే, నా దగ్గర దాచుకో, క్షేమంగా ఉంటుంది. నగరంలో దొంగల భయం జాస్తిగా ఉన్నది కాబట్టి హెచ్చరిస్తున్నాను," అన్నాడు సత్రం యజమాని రాజుతో.

"నా వద్ద కాసుల మూట ఉన్నది. అందులో వెయ్యి వరహాలున్నాయి. కానీ ఆ మూటను నా దగ్గరే ఉంచుకుంటాను. ఏ దొంగా నన్ను దోచుకోలేడు," అని రాజు నిర్భయంగా చెప్పి, తనకిచ్చిన గదిలోకి వెళ్ళిపోయాడు.

ఈ మాటలు బాటసారిగా నటిస్తున్న ఒక దొంగ విన్నాడు. వాడు రాత్రికి రాత్రి రాజు గదిలో ప్రవేశించి, ఆయన వద్ద వున్న వరహాల మూటను దొంగిలించి వెళ్ళిపోయాడు. తెల్లవారుఝామునే నిద్రలేచిన రాజు విషయం గ్రహించి సత్రం యజమాని వద్దకు వెళ్ళి, "నా వరహాల మూట పోయింది. నేనిప్పుడు అవసరం అయిన పనిమీద బయటకు వెళుతున్నాను, రాత్రికి తిరిగి వస్తాను. ఈలోగా వెయ్యి వరహాలున్న నా మూట దొంగిలించబడిందని, నీవు కొత్వాలుకు ఫిర్యాదు చెయ్యి. నా మూట దొరికితే తగిన బహుమతి ఇచ్చి సత్కరిస్తాను," అన్నాడు.

అందుకు సత్రం యజమాని, "అయ్యా! ఈ దేశపు రాజు మంచివాడు, సమర్థుడు. కానీ కొత్వాలు దుష్టుడు. అందువల్లనే సత్రంలో బాటసారులను దొంగలు దోచుకున్నా, నేనేమీ

శ్రీరామకమల్



చెయ్యలేకపోతున్నాను. నిన్ను నేనుముందుగా హెచ్చరించిన కారణమూ అదే! బాటసారుల ధనాన్ని దాచేందుకు, నా వద్ద భద్రతాదళము న్నది. ఏ దొంగా ఆ దళం జోలికి రాడు. కానీ బాట సారులను దోచుకోకుండా ఆపడం, నావల్ల కాదు. అందుకు కారణమైన కొత్వాలుకు ఫిర్యాదునివ్వడం చెవిటివాని ముందు శంఖం ఊదడమే అవుతుంది,'' అన్నాడు రాజుతో.

''ఇదంతా ఒట్టి పుకారు. నాకు కొత్వాలు మీద కూడా నమ్మకముంది. నీవు నేను చెప్పి నట్లు చేయి,'' అని రాజు వెళ్ళిపోయాడు.

మళ్ళీ రాత్రికి రాజు మారువేషంలో సత్రం చేరుకునేసరికి, సత్రం యజమాని నవ్వుతూ, ''నేను కొత్వాలుకు ఫిర్యాదు చేశాను, కానీ ఫలితమేమీ వుండదు,'' అన్నాడు.

రాజు తన గదిలోకి వెళ్ళాడు. కొద్ది సేప టికి, ఒక అపరిచితుడు రాజు గదిలోకి వచ్చి, ''నువ్వుత్త అబద్ధాలకోరువు!'' అన్నాడు. రాజు ఆశ్చర్యంగా, ''నేను నిన్ను ఇదే మొదటి సారిగా చూస్తున్నాను. నేను అబద్ధాల కోరు నని, నీకెలా తెలుసు?'' అని అడిగాడు.

''నిన్న రాత్రి నీ వరహాలమూటను దొంగి లించింది నేనే. మూట చాలా పెద్దదిగా వున్నా అందులో గుడ్డముక్కలు, చిన్నచిన్న రాళ్ళు వున్నాయి. వరహాలు మాత్రం వంద వున్నాయి. కానీ నువ్వేమో వెయ్యి వరహాలు పోయినట్లు కొత్వాలుకు ఫిర్యాదు చేయించావు,'' అన్నాడు దొంగ ఈసడిస్తున్నట్టు.

రాజు, వాడికేసి తీవ్రంగా చూస్తూ, ''దొంగ తనం చేయడమే కాక, ఆ సంగతి నిర్భయంగా చెబుతున్నావు. నువ్వు గుండెలు తీసిన బంటు లాగున్నావే!'' అన్నాడు.

''అదంతా వేరే సంగతి. నువ్వు ఇప్పటి కిప్పుడు కొత్వాలు ఇంటికి వచ్చి, నీ మూటలో వున్నవి నూరువరహాలేనని నిజం చెప్పాలి,'' అన్నాడు దొంగ.

''చెప్పకపోతే?'' అన్నాడు రాజు.

దొంగ తన దుస్తుల్లోంచి చిన్న కత్తి తీసి బెదిరిస్తూ, ''చెప్పకపోతే నీ ఒంటినిండా గాయాలు చేస్తాను!'' అన్నాడు.

రాజు ఒడుపుగా వాడిచేయి పట్టుకుని, చిన్న దెబ్బతో వాడిచేతిలోని కత్తి కిందపడేలా చేశాడు. తర్వాత వాడిరెండు చేతులూ విరిచి కట్టి, ''నిన్ని ప్పుడే కొత్వాలుకప్పగిస్తాను,'' అన్నాడు.

''సరే, నన్ను కొత్వాలుకు అప్పగించు. కానీ ఆయనకు నీ మూటలో వున్నవి వెయ్యి వరహాలు కాదనీ, నూరువరహాలేననీ చెప్పు, లేకుంటే కొత్వాలు నన్ను బ్రతకనివ్వడు,'' అన్నాడు దొంగ ఏడుస్తూ.

"దొంగగా పట్టుబడ్డందుకూడా భయ పడక, మూటలో ఎంత డబ్బు పోయిందో చెప్పితీరాలని ఇంతగా గోలపెడుతున్నావు, నీ తీరు నాకు చిత్రంగా వుంది," అన్నాడు రాజు.

దొంగ ఒకసారి పెద్దగా మూలిగి, "నేను దొంగనే అయినప్పటికీ నిజాయితీపరుణ్ణని కొత్వాలు నమ్మాలి. నేను దొంగిలించినమూటలో నూరు వరహాలే వున్నాయని, ఆయన నన్ను కొరడాదెబ్బలు కొట్టించాడు. కావాలంటే నా వీపు చూడు!" అన్నాడు దొంగ.

రాజు వెనక్కు వెళ్ళి చూస్తే, వాడివీపు మీద దెబ్బల గుర్తులున్నాయి.

"కొత్వాలు తన బాధ్యతను చక్కగా నిర్వహిస్తున్నాడు. దొంగతనం చేసినందుకు, నీకీ శిక్ష పడితీరవలసిందే!" అన్నాడు రాజు.

"అయ్యా! నీకు పోయినవి నూరు వరహాలే కదా? నీకు నేను రెండు నూర్ల వరహాలిస్తాను, కొత్వాలుకు నిజం చెప్పు. నా నిజాయితీని ఆయన నమ్మకుంటే, నాకు బ్రతుకే భారమైపోతుంది," అన్నాడు దొంగ.

ఇది మరింత ఆశ్చర్యంగా తోచి రాజు, దొంగను నిలదీస్తే-వాడు దొంగతనం చేయగానే కొత్వాలు వద్దకు వెళ్ళి, మూటలో నూరు వరహాలున్నాయని చెప్పి, సగం వాటా ఆయనకు, యాభై వరహాలిచ్చి వచ్చినట్లు చెప్పాడు. కానీ, ఆ తరవాత సత్రం యజమాని చేసిన ఫిర్యాదులో, పోయినవి వెయ్యి వరహాలని తెలిసి, తన వాటా మిగిలిన నాలుగు వందల యాభై వరహాల కోసం, కొత్వాలు వాడిని బాగా హింసించాడు. దొంగ తన నిజాయితీని రుజువు చేసుకునేందుకు సత్రానికి వచ్చాడు.

ఆ సరికి రాజుకు అసలు విషయం అర్థమైంది. ఆయన దొంగకు తానెవరో తెలియజెప్పి, ఇకనుంచి బుద్ధిగా బ్రతకమని హెచ్చరించి పంపేశాడు.

తర్వాత ఆయన రాజభటులను పంపి కొత్వాలును బందీ చేయించాడు. "ఇదేమిటి, మహారాజా!" అంటూ గోలపెట్టినకొత్వాలుతో, "నువ్వు దొంగల నుంచి నిజాయితీని ఆశిస్తున్నావు. అయితే, నీలోమాత్రం నిజాయితీ లేదు. కొంతకాలం పాటు కారాగారంలో దొంగల మధ్య గడుపుతూ, వాళ్ళ నుంచి నిజాయితీ నేర్చుకో," అన్నాడు రాజు.

తర్వాత చంపానగరంలో దొంగతనాలు ఆగిపోయాయి.



## హిమాచల్ ప్రదేశ్ జానపద కథ

పర్వతాల రాష్ట్రమైన హిమాచల్‌ప్రదేశ్, పశ్చిమ హిమాలయాల మధ్య ఉన్నది. ఇది సముద్రమట్టానికి 350-675 మీ. ఎత్తులో ఉంటున్నది.

స్వాతంత్ర్యానంతరం ఇక్కడి పర్వత ప్రాంతాలన్నిటినీ కలిపి ఒక కేంద్రపాలిత ప్రాంతాన్ని ఏర్పాటు చేశారు. ఇవన్నీ సిమ్లా చుట్టూ ఉన్న ప్రాంతాలే. 1966 మే 1 వ తేదీ పంజాబ్ ప్రాంతంలోని కొండల ప్రదేశాలు ఇందులో కలుపబడ్డాయి. 1971 జనవరి 25 వ తేదీ పరిపూర్ణ హిమాచల ప్రదేశ రాష్ట్రం ఏర్పాటయింది.

ఈ రాష్ట్రంలో సట్లజ్, రావి, బీయస్, పార్వతి నదులు ప్రవహిస్తున్నాయి. రాష్ట్రంలో చాలా తటాకాలూ ఉన్నాయి. రేణుక, రేవల్సర్, ఖజ్జియార్, దాల్, బీస్‌కుండ్, దాసావుర్, బ్రిఘు, ప్రషార్, మణిమహేష్, చందర్ తాల్, సూరజ్‌తాల్, కరేరి, సెయో ల్సార్, గోవింద్ సాగర్, నాకా మొదలైనవి వాటిలో ముఖ్యమైనవి.

55,673 చ.కి.మీ వైశాల్యం గల ఈ రాష్ట్ర జనాభా 60,77,248. ఉత్తర దిశలో జమ్ము కాశ్మీర్; ఆగ్నేయ దిశలో ఉత్తరప్రదేశ్; దక్షిణంగా హర్యానా; పశ్చిమ వాయవ్యాలలో పంజాబ్; తూర్పున చైనా సరిహద్దులుగా కలిగిన రాష్ట్రం ఇది.

రాష్ట్ర రాజధాని సిమ్లా. హిందీ అధికార భాష. జిల్లాలలో పలు మాండలికాలు మాట్లాడే ప్రజలు ఉన్నారు.

# దయ్యం అంగీ

ఒకానొకప్పుడు లాహౌల్‌లోని పుయ్‌కార్ గ్రామంలో పుంచోక్ అనే పేరుమోసిన జ్యోస్యుడు ఉండేవాడు. చుట్టుపక్కల నుంచీ, దూరప్రాంతాలనుంచీ అతని సలహాలకోసం, సహాయం కోసం ప్రజలు వచ్చేవారు. జాతకాలు చూడడం, ముహూర్తాలు పెట్టడం మాత్రమే కాదు; పుంచోక్ పితృదేవతలను రప్పించి, వారితో సంభాషించేవాడు. సాక్షాత్తు గ్రామదేవత అతన్ని ఆవహించి, అతని కంఠస్వరంతో మాట్లాడేది. అతని కారణంగా పుయ్‌కార్ గ్రామం, చుట్టుపక్కల ఎంతో ప్రసిద్ధిగాంచింది.

ఒకనాడు పొరుగు గ్రామమైన సాతింగ్రి గ్రామపెద్ద నౌకరు పుంచోక్‌ను చూడడానికి వచ్చాడు. అతడు పుంచోక్‌కు నమస్కరించి, ''మా గ్రామాన్ని ఒక అల్లరిదయ్యం పట్టి పీడిస్తు



న్నది.అది చిల్లరమల్లర దొంగతనాలు చేస్తుంది. కుండలు పగులగొడుతుంది. కొట్టాల నుంచి గొర్లను విప్పి తరిమేస్తుంది. పంటపొలాలను నాశనం చేస్తుంది. వంటచెరకు కోసం తెచ్చిపెట్టిన కట్టెలకు నిప్పంటిస్తుంది. పిల్లలను భయపెడు తుంది. ఇన్ని తుంటరి పనులు చేసినప్పటికీ, ఇన్నాళ్ళు పోనీలే అని ఊరుకున్నాము. ఇటీవల దాని ఆగడాలు మరీ ఎక్కువైపోయాయి,'' అని చెప్పి ఆగి, పుంచోక్ భార్య తెచ్చి ఇచ్చిన లోటా ఛాంగ్‌ను తీసుకున్నాడు.

''అది ఇప్పుడు ఏం చేసిందేమిటి?'' అని అడిగాడు పుంచోక్.

'' ఆ దయ్యం నిన్న క్షమించరాని నేరం చేసింది,'' అన్నాడు నౌకరు.

''అలాగా! ఏమిటా నేరం?'' అని అడిగాడు పుంచోక్.

నౌకరు ఛాంగ్‌ను తాగి ముగించి, ''నిన్న సాయంకాలం గ్రామపెద్ద పంచాయతీలో ఉన్నాడు. ఇద్దరు గ్రామస్థుల మధ్య ఏర్పడిన తగాదాకు పెద్దల సమక్షంలో పరిష్కారం చెబు తున్నాడు. ఉన్నట్టుండి గ్రామపెద్ద గుబురు గడ్డం కనిపించకుండా పోయింది,'' అన్నాడు.



''ఎక్కడికి పోయింది?'' అని అడిగాడు పుంచోక్.

''అంతా ఆ అల్లరి దయ్యం పని! ఆయన గడ్డాన్ని దయ్యం తినేసింది. మేము అంత మంది ఉండీ ఏమీ చెయ్యలేకపోయాం. మాలో కొందరు దాని వెంటబడి పట్టుకోవడానికి ప్రయ

## చాంబా రుమాల్



హిమాచల్‌ప్రదేశ్ అనగానే గుర్తుకు వచ్చేవి చాంబా రుమాళ్ళు. ఇవి సునిశితమైన చాంబాశైలి (ఎంబ్రాయిడరీ) అల్లిక పనులు నిండిన చిన్న గుడ్డలు. రుమాలు అంటే చేతిగుడ్డ అని మన కందరికీ తెలుసు. ఇది పేరుకు రుమాలే తప్ప దీనిని పురుషులు అలంకారంగా భుజాల మీద వేసుకుంటారు. స్త్రీలు మేలిముసుగుగా ధరిస్తారు. చాంబా రుమాలును చాలా విలువైనదిగా భావిస్తారు. ఎన్ని అలం కారాలు చేసినప్పటికీ ఇది లేకపోతే పెళ్ళికూతురి అలంకరణను అసంపూర్ణంగానే భావిస్తారు.

ఎంబ్రాయిడరీ పనులకే కాకుండా శాలువాలకూ, దుప్పట్లకూ, తివాసీలకూ కూడా హిమాచల్‌ప్రదేశ్ పేరుగాంచింది. చాంబా, కాంగ్రా మినియేచర్ పెయింటింగ్స్, గొంపాశైలి వర్ణచిత్రాలు కూడా చాలా ప్రసిద్ధిగాంచాయి.

త్నించారు. కాని, ఫలితం లేకపోయింది. మీరు వచ్చి ఆ తుంటరి దయ్యాన్ని ఎలాగైనా గ్రామం నుంచి తరుమగొట్టాలి!'' అన్నాడు నౌకరు కళ్ళ నీళ్ళు పెట్టుకుంటూ.

పుంచోక్ ఏవో మూలికల పుల్లలకట్టా, దండం, కమండలం అంటూ తన సాధన సామగ్రిని తీసుకుని వచ్చిన నౌకరు వెంట బయలు దేరాడు.

సాతింగ్రి గ్రామపెద్ద ఇల్లు శోకంలో మునిగి ఉంది. ఇంట్లో పిల్లలూ, పెద్దలూ కన్నీళ్ళు కారుస్తూ, కళ్ళుతుడుచుకుంటూ కనిపించారు. పుంచోక్ గ్రామపెద్దను సమీపించాడు. ఆయన జరిగిన దుర్ఘటన దిగ్భ్రాంతి నుంచి ఇంకా కోలుకోలేదు. పక్కనున్న ఆసనాన్ని చూపి పుంచోక్‌ను కూర్చోమని చెప్పినప్పుడు ఆయన పెదాలు వణికాయి. జ్యోస్యుడికి తేనీరు తెచ్చి ఇవ్వమన్నాడు.

''మా నౌకరు మీకు అంతా వివరించి ఉంటాడు. నిన్న నాగడ్డం తినేసిన ఆ దయ్యం, రేపు మరొకరి జుట్టు తినేయవచ్చు. ఎల్లుండి వేరొకరి ముక్కు తినవచ్చు. దాన్ని వదిలిపెట్ట గూడదు. ఎలాగైనా ఊరి నుంచి తరుమ గొట్టాలి!'' అన్నాడు గ్రామపెద్ద ఆగ్రహంతో.

''దానిని ఇప్పుడే తరుమగొడతాను,'' అంటూ పుంచోక్ తన సాధనసామగ్రి సంచీ విప్పాడు. తలకు చుట్టూ పలుచటి బట్ట బిగించాడు. మంత్ర దండాన్ని తీసి బయటపెట్టాడు. వెంట తెచ్చిన హోమం పుల్లలను పేర్చి, నిప్పంటించాడు. క్షణాలలో ఇల్లంతా దట్టమైన పొగ కమ్ముకున్నది. ఆ పొగ ఘాటుకు అందరూ తుమ్మసాగారు. పుంచోక్ తన బుగ్గలపై సూదులు గుచ్చుకుని కనుగుడ్లు పైకి తిప్పుతూ గట్టిగా మంత్రాలు ఉచ్చరించసాగాడు.

కొంతసేపటికి సాతింగ్రి దయ్యం వచ్చి అతని ఎదుట నిలబడింది. తనను నిప్పుల్లోకి ఏదో లాగుతున్నట్టు గ్రహించి, ఆ దయ్యం తన ఒంటిపై ఉన్న అంగీని తీసి మంటలకేసి విసిరి, తూర్పు దిక్కుగా పారిపోయింది. అందరూ ఎంతో సంతోషించారు. తృప్తిగా నిట్టూర్చారు.

దయ్యం తీసి విసిరిన దాని అంగీ నిప్పుల్లో పడలేదు. కొద్ది దూరంలో పడిన దానిని పుంచోక్ తీసి,విదిలించి మడిచి సంచీలో పెట్టుకున్నాడు. బయలుదేరడానికి సిద్ధమవుతూన్న పుంచోక్‌కు గ్రామపెద్ద కృతజ్ఞతతో డబ్బూ, విలువయిన కానుకలూ ఇచ్చాడు. పుంచోక్ వాటన్నిటినీ తీసి మూట కట్టుకుని తిరుగుప్రయాణమయ్యాడు.

అతడు కొండలగుండా నడిచి వెళుతూండగా ఏదో దభీమని శబ్దం వినిపించి తలెత్తి చూశాడు. ఎదురుగా సాతింగ్రి దయ్యం. ''నా అంగీ నాకిచ్చెయ్. నీకు ఏం కావాలన్నా ఇస్తాను,'' అన్నది దయ్యం.

''ఇవ్వను,'' అంటూ పుంచోక్ మూటను



## ఆపిల్ పళ్ళు



ప్రత్యేకమైన మేలురకం గోల్డన్ ఆపిల్స్‌కు హిమాచల్‌ప్రదేశ్ చాలా ప్రసిద్ధిగాంచింది. శామ్యువల్ ఇవాన్స్ (సత్యానంద్ స్టోక్స్) అనే ఒక అమెరికన్ మిషనరీ హిమాచల్‌ప్రదేశ్‌లో ఆపిల్ సాగుకు నాంది పలికాడు. 1904 లో ఆయన తన దేశం నుంచి తెచ్చిన ఆపిల్ విత్తనాలను ఇక్కడ నాటాడు. ఈనాడు ఆపిల్ పళ్ళు పండే ప్రధాన ప్రదేశంగా కోల్‌ఘర్ పేరుగాంచింది. రాష్ట్రంలో ఇక్కడే ఎక్కువగా ఆపిల్స్ పండుతాయి.

కాంగ్రా, ధానేడార్ లోయల్లో కూడా ఆపిల్ తోటలు ఎక్కువగా ఉన్నాయి. ఆపిల్ తోటలతో పాటు పర్వతసానువులలో తేయాకు తోటలు కూడా విస్తారంగా కనిపిస్తాయి.

గట్టిగా పట్టుకున్నాడు. ఆ దయ్యానికి ఈ అంగీ చాలా అవసరం. లేకుంటే అది తననెందుకు ఇంతగా అడుగుతుంది? అని ఆలోచించసాగాడు.

''అది లేకుంటే చలితో చచ్చిపోగలను. నాకున్నది అదొక్కటే అంగీ!'' అన్నది దయ్యం.

పుంచోక్ ఆ మాటను నమ్మకుండా, దయ్యం ఇలా వెంటబడడానికి ఏదో బలవత్తరమైన కారణమే ఉండాలి, అనుకుంటూ ముందుకు నడిచాడు.

''నీకు నేను జీవితాంతం సేవలు చేస్తూ బతకలేను. నా అంగీ నాకిచ్చెయ్,'' అని బతిమాలుతూ దయ్యం జ్యోస్యుడి వెంట వెళ్ళసాగింది.

''ఆహా! అంటే నీ అంగీ నాదగ్గర ఉన్నంత కాలం, నువ్వు నాకు సేవకుడిగా ఊడిగం చేస్తావన్నమాట! అవునా?'' అన్నాడు పుంచోక్ పట్టరాని ఆనందంతో.

దయ్యం మాట్లాడకుండా మౌనంగా వెళ్ళిపోయింది.

పుంచోక్ ఉత్సాహంతో ఇల్లు చేరాడు. పక్క ఊరి గ్రామపెద్ద ఇచ్చిన డబ్బునూ, కానుకలనూ భార్యకు ఇచ్చాడు. దయ్యం అంగీ విషయం మాత్రం ఆమెకు చెప్పకుండా దానిని అటకపై భద్రంగా దాచాడు.

ఆ రోజు నుంచి అతడు తలుచుకుంటే దయ్యం ప్రత్యక్షమయ్యేది. చెప్పిన పని క్షణాలలో చేసి ముగించేది. శీతాకాలంలో ఇంటి గుమ్మంలో కురిసే మంచును తొలగించేది. కొండ దిగువన ఉన్న బుగ్గల నుంచి నీళ్ళు మోసుకొచ్చేది. వసంతకాలంలో పుంచోక్ పొలందున్ని బార్లీ చల్లేది. పంట సిద్ధమయ్యాక కోసి, నూర్పిడి చేసి ధాన్యాన్ని ఇంటికి చేర్చేది. చెప్పినప్పుడు బార్లీ పిండి తయారుచేసేది. వేసవి కాలంలో కొండలమధ్య ఉన్న దేవదారు అడవులకు వెళ్ళి వంటచెరకు తెచ్చేది.

పుంచోక్‌కు ఇప్పుడు రోజులు సుఖంగా గడిచిపోతున్నాయి. దయ్యానికి పనులు పురమాయిస్తూ హాయిగా తిరగసాగాడు. తన వృత్తిపర



మైన పనులను కూడా మానుకున్నాడు. పనీ, పాటూ లేకపోవడం వల్ల క్రమంగా లావెక్క సాగాడు. దయ్యం మాత్రం డీడిగం చేసి చేసి నీరసించిపోసాగింది.

అప్పుడప్పుడు దయ్యం, అతన్ని తన అంగీ తిరిగి ఇవ్వమని అడుగుతూ ఉండేది. అయితే, ఫుంచోక్ నవ్వి ఊరుకునేవాడు.

ఒకనాడు ఫుంచోక్ దూరంలో ఉన్న ఒక గ్రామానికివెళ్ళవలసి వచ్చింది. ఆ గ్రామ పెద్దలు వచ్చి, తమ దేవాలయంలో ప్రత్యేక పూజలు జరిపించాలని ఫుంచోక్‌ను కోరారు. అది చాలా ప్రతిష్ఠాత్మకమైన పూజావిధానం కావడంవల్లా, పెద్దల మాట కాదనలేకా ఫుంచోక్ వారి వెంట బయలుదేరాడు.

అదే మంచి అవకాశంగా భావించిన సాతింగ్రి దయ్యం, గొంపూ దయ్యం దగ్గరికివెళ్ళి తన గోడు వెళ్ళబోసుకున్నది. గొంపూ దయ్యం దయ్యాల కన్నిటికీ పెద్ద. ప్రపంచంలోని దయ్యాల సమస్యలకన్నిటికీ అది చక్కని పరిష్కారమార్గాలు చూపేది.

సాతింగ్రి దయ్యం మాటలను శ్రద్ధగా విన్న గొంపూ దయ్యం తలాడించి, ''దయ్యాలు తమ పరిమితుల్ని దాటడంవల్ల దాపురించే అగచాట్లు ఇవి. గ్రామస్థులందరి సమక్షంలో నువ్వు గ్రామ పెద్ద గడ్డం లాగి తినడం పెద్ద నేరం కాదా? అలా ఎందుకు చేశావు? దయ్యాలు అల్లరి పనులు చేయవచ్చు. అది దయ్యాల హక్కు కూడానూ. అయితే పొగరుతో హద్దు దాటితే ఫలితం అనుభవించక తప్పదు. నీ విషయంలోనూ అదే జరిగింది!'' అన్నది.

సాతింగ్రి దయ్యం కన్నీళ్ళు కారుస్తూ, గొంపూ దయ్యం కాళ్ళు పట్టుకుని, ''ఈ ఒక్క సారి నన్ను క్షమించి కనికరించు. ఇకపై ఇలాంటి తప్పు చేయను. హద్దులెరిగి బుద్ధిగా నడుచుకుంటాను,'' అన్నది.

''సరే, ఫుంచోక్ నుంచి నీ అంగీని తిరిగి రాబట్టడానికి ప్రయత్నిస్తాను, నువ్వు వెళ్ళు,'' అన్నది గొంపూ దయ్యం.

సాతింగ్రి దయ్యం సంతోషంగా తిరిగి వచ్చింది.

గొంపూ దయ్యం ఒక గొర్రెలకాపరి రూపంలో ఫుంచోక్ ఇంటికి వెళ్ళి, అతని భార్యతో, 'నేనూ, ఫుంచోక్ బాల్యమిత్రులం. అయితే ఒకరినొకరు చూసి కొన్నేళ్ళయింది. ఆ దారిగుండా వెళుతూ పాత స్నేహితుణ్ణి పలకరించి వెళదామని వచ్చాను,'' అన్నాడు.

''అయన ఇంట్లో లేరు. ముఖ్యమైన పని మీద పొరుగూరు వెళ్ళారు. రేపే రాగలరు. ఈ రోజు ఇక్కడే ఉండి చూసి వెళ్ళండి,'' అన్నది ఫుంచోక్ భార్య మర్యాదపూర్వకంగా.

''వీలుకాదమ్మా! రేపు వేకువజామునే ఒక పెళ్ళి. తప్పక వెళ్ళాలి. తిరుగుప్రయాణంలో నా స్నేహితుణ్ణి చూస్తాను. అయితే ఒక విషయం. నువ్వు సాయపడగలవేమో చూడు చెల్లెలా! నేను కొన్నాళ్ళ క్రితం ఒక పాత అంగీని నా స్నేహితుడి దగ్గర భద్రపరచమని ఇచ్చాను. అది

ఇప్పుడు కావాలి. చూసి ఇచ్చావంటే బావుం టుంది,'' అన్నాడు గొర్రెలకాపరి.

''అదెంత పని! అలాగే చూసి ఇస్తాను. ఇంతదూరం వచ్చారు, భోజనం చేసి వెళ్ళండి,'' అంటూ రుచికరమైన భోజనం వడ్డించింది. అతడు భోజనం చేసి విశ్రాంతి తీసుకుంటున్న సమయంలో, అతడు చెప్పిన అంగీ కోసం ఇల్లంతా వెతికింది. ఆఖరికి అటకమీద అంగీ కనిపించింది. అది తన భర్తది కాదని ఆమెకు తెలుసు గనక, దానిని తెచ్చి అతనికిచ్చి, ''ఇదే నేమో చూడండి!'' అన్నది.

దానిని చూడగానే పరమ సంతోషంతో గొర్రెలకాపరి, ''అవును తల్లీ, ఇదే నాది. పెద్ద ఉపకారం చేశావు. కృతజ్ఞతలు!'' అంటూ దానిని తీసుకుని వెళ్ళిపోయాడు.

ఆ తరవాత దానిని అది సాతింగ్రి దయ్యా నికి ఇచ్చింది. దానిని తీసుకుని సంతోషంగా



## పర్యాటక ప్రదేశాలు!

అత్యద్భుత ప్రకృతిశోభకు నిలయమైన 'కులూ' లోయ ఈ రాష్ట్రంలోనే ఉన్నది. దీనిని 'దేవతల లోయ' అని వర్ణిస్తారు.

సిమ్లా ప్రధానమైన వేసవి విడిది. దీని చుట్టూ పలు ఆకర్షణీయమైన పర్యాటక ప్రదేశాలు ఉన్నాయి. పర్యాటకులను విశేషంగా ఆకర్షించే డల్హౌసీ వేసవి విడిది కూడా ఇక్కడే ఉన్నది.

తొడుక్కున్న సాతింగ్రి దయ్యం పరమానం దంతో, ''ఈ జన్మలో ఇక మానవుల జోలికి పోను; హాని తలపెట్టను. నీ మేలు మరవను,'' అంటూ అక్కడి నుంచి ఎగిరి వెళ్ళిపోయింది.

పుంచోక్ మరునాడు తిరిగి రాగానే, అతని భార్య—పుంచోక్ బాల్యస్నేహితుడు రావడం గురించీ, అతనికి భోజనం పెట్టి పాత అంగీని వెతికి ఇవ్వడం గురించీ చెప్పి, ''ఆయన తిరుగు ప్రయాణంలో మిమ్మల్ని చూడడానికి వస్తాన న్నాడు,'' అన్నది.

పుంచోక్ ఒక్క క్షణం దిగ్భ్రాంతి చెందాడు. ఆ తరవాత కోలుకుని, ''ఎంతపని చేశావు!'' అంటూ దయ్యం తనను మోసం చేసిందని గ్రహించి బాధపడ్డాడు.

పుంచోక్ ఆ రోజునుంచి ఎప్పటికప్పుడు పొలం పనులు చేసుకోవడం; గుమ్మంలోని మంచును శుభ్రపరచడం; కొండ కింది నుంచి పైకి నీళ్ళు మోసుకురావడంతోపాటు—మనుషు లను బాధించే దయ్యాలను వదలగొట్టడం, జాతక ఫలాలు చెప్పడం అంటూ తన వృత్తిపరమైన పాత పనులను మళ్ళీ మొదలుపెట్టాడు.

# మనదేశం గురించి తెలుసుకుందాం

ఇండియా గత యాభై అయిదు సంవత్సరాలుగా స్వతంత్రదేశంగా ఉంటోంది. అర్ధ శతాబ్ద కాలంగా ఎన్నో ఒడిదుడుకులను అధిగమిస్తూ మన ప్రజాస్వామ్యం ముందుకు సాగుతోంది. ఈ నెల క్విజ్‌లో కొన్ని ముఖ్యమైన సంఘటలను గుర్తు చేసుకుందాం.

1. మన జాతిపిత గాంధీజీ 1948 జనవరి 30 న హత్యకు గురయ్యారు. అంతకు పదిరోజుల ముందే అయన మీద హత్యాప్రయత్నం జరిగింది. ఆ సంఘటన ఏది?
2. భారత సైన్యానికి 1949 జనవరి 15 తేదీ మహోజ్వలమైన రోజు. ఆ తారీఖు ప్రాముఖ్యత ఏమిటి?
3. 1951 అక్టోబర్ 1952 ఫిబ్రవరి మధ్య మొట్టమొదటి సాధారణ ఎన్నికలు జరిగాయి. ఎన్నికలలో ఎన్ని పార్టీలు పోటీ చేశాయి? వాటిలో జాతీయపార్టీలు ఎన్ని?
4. ఎక్కువసార్లు బడ్జెట్ సమర్పించిన కేంద్ర ఆర్థికమంత్రి ఎవరో తెలుసా? ఎన్నిసార్లు?
5. మనదేశంలో ప్రసిద్ధిగాంచిన పర్వదినాలలో 'కుంభమేళా' ముఖ్యమైనది. మొట్ట మొదటిసారిగా అక్కడ తొక్కిసలాట జరిగింది. అదెప్పుడు జరిగింది? ఎందరు ప్రాణాలు కోల్పోయారో తెలుసా?
6. భారతరత్న పురస్కారం ఎప్పుడు నెలకొల్పబడింది? మొట్టమొదటి గ్రహీతలు ఎవరు?
7. 1951 లో ఢిల్లీలో ప్రథమ ఆసియా క్రీడలు జరిగాయి. భారతదేశానికి తొలి బంగారు పతకం సాధించినవారెవరు?
8. ఇండియా ప్రథమ కార్డినాల్ ఎవరు? ఎప్పుడు నియమించబడ్డారు?
9. 1948 లో రాష్ట్రాల అతిపెద్ద యూనియన్ ఏర్పడింది. దాని పేరేమిటి? రాజధాని ఏది?
10. 1950 ఏప్రిల్, డిసెంబర్ నెలలలో మనదేశానికి చెందిన ఇద్దరు సుప్రసిద్ధ ఆధ్యాత్మిక గురువులు పరమపదించారు. వారెవరు?

(సమాధానాలు వచ్చేనెలలో)

## నవంబర్ క్విజ్ సమాధానాలు

1. తండ్రి కూతురికి రాసిన లేఖలు.
2. 1947 అగస్టు 15 అర్ధరాత్రి. పార్ల మెంటు సెంట్రల్ హాల్లో స్వాతంత్ర్య ప్రకటన సందర్భంగా.
3. విజయలక్ష్మి పండిట్; యునైటెడ్ ప్రావిన్స్ (ఈనాటి ఉత్తరప్రదేశ్).
4. కాదు.
5. వానరసేన. జాతీయ నాయకుల మధ్య సందేశాలు తీసుకువెళ్లడం.
6. ఇండియా-పాకిస్తాన్ యుద్ధంలో విజయం (డిసెంబర్ 3-16)



# విఘ్నేశ్వరుడు

వినాయకచవితి నాటి మునిమాపువేళ విఘ్నేశ్వరుడు పడమటి ఆకాశంలో తన దంతంలాగే ఉన్న చంద్రుణ్ణి చూస్తూ, నిండుబొజ్జతో మందంగా అడుగులు వేస్తున్నాడు. చిట్టెలుక వెంట వస్తున్నది.

నెలవంక విఘ్నేశ్వరుడి సంకేతం అంటారు. విఘ్నేశ్వరుడి నుదుట తెల్లని మంచిగంధంతో తీర్చిదిద్దిన బాలచంద్ర తిలకం, ఆకాశం మీది చవితిచంద్రుడి ప్రతిబింబంలాగ ప్రకాశిస్తున్నది. ఫాలచంద్రుడు, బాలచంద్రుడు అని కూడా విఘ్నేశ్వరుడికి పేర్లున్నవి.

కాలి బొటనవ్రేలికి చిన్న రాయి తగిలి వినాయకుడు అమాంతంగా బోర్లాపడ్డాడు. కడుపు పగిలిపోయింది. తినుబండారాలు వెలికి వచ్చి నేల విరజిమ్ముకున్నాయి. అదే అదనుగా ఎలుక వాటిని గబగబా తినసాగింది. ఆ వినోదానికి, ఆకాశపు చిరునవ్వులా ప్రకాశించే చందమామ పకపకా నవ్వాడు. దేవతలు మొదలైనవారంతా వచ్చి, పెద్దసర్పంతో వినాయకుడి బొజ్జ కలిపి కుట్టారు.

పార్వతికి చంద్రుడి మీద చాలా కోపం వచ్చింది. ఆమె, ''వినాయకచవితినాడు చంద్రుణ్ణి చూస్తే, నీలాపనిందలు వచ్చి పడతాయి!'' అని శపించింది.

అది మొదలు పిల్లల్ని సైతం చూడనివ్వకుండా, వినాయకచవితి నాడు చంద్రదర్శనుకాకుండా, అంతా చాలా జాగ్రత్తపడుతూ వచ్చారు.

ద్వాపరయుగం వచ్చింది. దేవకీ వసుదేవులకు చెరసాలలో పుట్టి, గోకులంలో యశోద ముద్దులపట్టిగా పెరుగుతున్న బాలకృష్ణుడు పూతన, శకటాసురుడు, తృణావర్తుడు అనే




రాక్షసుల్ని అప్పటికే చంపేశాడు, బాగా మాటలు నేర్చాడు.

ఆ రోజు వినాయకచవితి. యశోద పాలు పితుకుతున్నది. బాలకృష్ణుడు యశోద వీపు మీద నుంచి వంగి పాత్రలోని పాలలో ప్రతిబింబించిన చంద్రవంకను చూసి, "చందమామ! పాలల్లో చందమామ!" అంటూ చప్పట్లు చరిచాడు.

యశోద గతుక్కుమని, "ఎంతపని చేశావు కన్నా! ముందు, ముందు ఎన్ని నీలాపనిందలు పడవలసి వస్తుందో మరి," అని నొచ్చుకుంది.

"నీలాపనింద అంటే ఏమిటమ్మా?" అన్నాడు కృష్ణుడు.

"ఉత్తినే నిన్ను దొంగ అంటారు!" అన్నది యశోద.

"విచారించకమ్మా! పాలు, వెన్న దొంగతనం చేస్తుంటానమ్మా అప్పుడది నీలాపనింద అవదుగా!" అన్నాడు కృష్ణుడు.

"అరి పిడుగా! నీ నోట బ్రహ్మాండాలు విరుచుకుపడా!" అని అంటూ గోపమ్మ బుగ్గలు నొక్కుకున్నది.

"బ్రహ్మాండాలు చూశావామ్మా?" అని కృష్ణుడడిగాడు.

యశోద, "బ్రహ్మాండాలకేంగాని, పెద్దయినా నీ మీద అభాండాలు పడ్డం ఖాయం!" అంటూ సున్నితంగా బాలుడి తలమీద మొట్టికాయ పెట్టింది.

"అప్పుడు మళ్ళీ ఇలాగే చందమామను చూడాలి కదూ?" అన్నాడు కృష్ణుడు.

"పెద్దయ్యాక చూస్తే మరీ తప్పు!" అంది యశోద మనసులో, "విఘ్నేశా! అభం శుభం తెలియని పసివాడు, నీడ చూశాడు, అంతే. మన్నించు!" అని అనుకుంటూ.

ఆ మర్నాడు బలరాముడు గబగబా వచ్చి యశోదతో, "అవ్వా! తమ్ముడు వీధిలో మన్ను తింటున్నాడు. అబద్ధం కాదు, వాడి నోరు చూడు!" అని చెప్పాడు. యశోద చరచరా వెళ్ళింది.

కృష్ణుడు మట్టిముద్దలు వరసగా పేరుస్తున్నాడు. యశోద కృష్ణుడి చెవి పట్టి, "ఏదీ నోరు తెరు!" అన్నది.

"నన్ను నీచేత కొట్టించాలని ఎవరో ఏదో చాడీ చెప్పినట్టుంది. నీలాపనిందలు పడతాయని నిన్ననేకదా నువ్వు చెప్పావు? మట్టితో, ఉండ్రాళ్ళు, లడ్లు చేస్తున్నానమ్మా. మట్టితో చేసిన వినాయకుడు మన్నుతో చేసినవైతేనే నిజంగా తింటాడమ్మా!" అన్నాడు కృష్ణుడు అమాయకంగా.

యశోద లెంపలు వేసుకుంటూ, "తప్పు నాయనా, తప్పు! మన్నుతో చేసినా, రాయితో

చెక్కినా దేవుడు దేవుడే! అపచారం స్వామీ! విఘ్నేశా! అమాయకుడైన పసిపిల్లవాడి మాటలు ఏమాత్రం పట్టించుకోకు!'' అని ధ్యానించింది.

''అయితే వచ్చే వినాయకచవితికి వెన్న ఉండ్రాళ్ళు, నేతి లడ్లు బోలెడన్ని చెయ్యి. ఎన్ని తింటాడో చూస్తా, తినకపోతే తినిపించుతా!'' అన్నాడు కృష్ణుడు.

''ముందు నీ నోరు చూపించు!'' అంటూ యశోద వంగి చూడబోతూంటే కృష్ణుడు ''ఆ'' అంటూ బార్లా నోరు తెరిచాడు.

యశోద అలా చూస్తూనే ముచ్చెమటలు పట్టి చతికిల కూలబడింది. కృష్ణుడి నోటిలో బ్రహ్మాండాలు, నక్షత్రమండలాలు, సూర్యుళ్ళు, చంద్రుళ్ళు, సముద్రాలు, పర్వతాలు; సమస్తమూ కనిపించాయి. పాలు పితుకుతున్న యశోద వీపున వాలి, మెడ చుట్టూరా చిట్టి చేతులు చుట్టి, పాలల్లో చందమామను చూపిస్తున్న కృష్ణుడు కనిపించాడు. యశోద కల అనుకుని గిల్లుకొని కళ్ళు నులుముకొంది. కలకాదు. ఏ దేవతో, వినాయకుడో తనను మాయలో ముంచేస్తున్నాడని అనుకుంటూ చుట్టూరా చూసింది.

యశోద వెర్రి చూపులకు చుట్టూ చేరిన పిల్లవాళ్ళు కేరింతలు కొడుతున్నారు. స్తంభం చాటున బల రాముడు ముసిముసి నవ్వులు నవ్వుతున్నాడు.

కృష్ణుడు యశోద ముఖం మీదకు వంగి, ''చూడమ్మా చూడు! మన్ను కనిపించిందా? బాగా చూడు!'' అంటూ తెరిచిన నోరు మరింత దగ్గిరగా చూపుతుంటే, యశోదకు దేవాది దేవుళ్ళు కనిపించారు. కృష్ణుడు పిల్లనగ్రోవి



ఊదుతూంటే, విఘ్నేశ్వరుడు తాండవం చేస్తూ కనిపించాడు. కృష్ణుడు పెద్ద నల్లని సర్పం తలల మీద తంతున్నాడు. అది కృష్ణుణ్ణి చుట్టి వేస్తున్నది.

యశోద కెవ్వున అరిచి మూర్ఛపోయింది.

యశోద తిరిగి కళ్ళు తెరిచేసరికి మంచం చుట్టూరా గోప భామలూ, అవ్వలూ కనిపించారు.

''నాకేమైంది?'' అని ఆశ్చర్యంగా అడిగింది యశోద.

ఆమెకు ఏదీ జ్ఞాపకం లేదు. ఏమీ జరగనట్టే అంతా మరిచిపోయింది.

''నీకేమైందో మాకు తెలియదుగాని, మా ఇళ్ళల్లో దొంగతనాలు జరిగాయి. ఆ దొంగ నీ ముద్దులకొడుకే! వెన్న, మీగడ, పాలు, పెరుగులు కుర్రమూకకీ, కోతులకూ పంచిపెడుతుండగా కళ్ళారా చూశాము!'' అని చెప్పారు గోపకాంతలు.




యశోద, ‘‘ఏమిటేమిటీ! అవన్నీ మీ ఇళ్ళల్లోవని ఎలాగ అనుకున్నారు? మా ఇంట లేవనుకున్నారా? గోకులం ఊళ్లోని ఇళ్లన్నీ కలిపి, మా ఇంట వున్నవాటిలో సగానికైనా రావు; వెళ్ళండి, వెళ్ళండి!’’ అంటూ వాళ్ళను సాగనంపింది.

కృష్ణుడు మెల్లగా వచ్చి, ‘‘ఏం జరిగిందమ్మా?’’ అనడిగాడు.

‘‘ఏం జరుగుతుందన్నానో అదే జరిగింది! నీమీద నీలాపనింద పడింది!’’ అన్నది యశోద బాధగా.

‘‘నీలాపనింద తప్పించుకున్నానమ్మా, వాళ్ళు చెప్పిందంతా నిజమేనమ్మా!’’ అన్నాడు కృష్ణుడు.

యశోదకు పట్టరాని కోపం వచ్చింది. పెద్ద తాడుతో కృష్ణుణ్ణి పెద్ద రోలుకు వేసి కట్టింది. కృష్ణుడు ఆ రోటిని ఈడ్చుకుంటూ వెళ్ళి, జంటగా పెరిగినరెండు మద్దిమానుల సందున దూరి రోటిని లాగాడు. మహావృక్షాలు రెండూ వ్రేళ్ళతో పెళ్ళగించుకొని కూలాయి. శాప విముక్తులైన గంధర్వులు కృష్ణుణ్ణి నుతించి ఆకాశానికెగిసి, అదృశ్యులయ్యారు.

ఏడాది తిరిగింది. వినాయకచవితి వచ్చింది. రంగురంగుల పెద్ద వినాయక విగ్రహాన్ని నందుడు చేయించాడు. యశోద పాలమీగడతో పిండి కలిపి ఉండ్రాళ్ళు, వెన్న అప్పాలు, నేతిలడ్లు, పాలతో జిల్లేడుకాయలు దండిగా చేసింది.

నైవేద్యాలన్నీ పళ్ళేల నిండా నింపి, పూజా మందిరంలో అమర్చి తలుపు చేరవేసి, యశోద అలా వెళ్ళింది.

కృష్ణుడు మెల్లగా పూజామందిరం ప్రవేశించి తలుపు మూసి, తినుబండారాల్ని వినాయక విగ్రహానికి అందిస్తూ, ‘‘తినవయ్యా తిను!’’ అంటూ ప్రతిమ బొజ్జ నిమిరాడు.

ప్రతిమ విఘ్నేశ్వరుడై తొండంతో అందుకొంటూ, ‘‘కృష్ణా! నేనందించేవి నువ్వు తినాలి! విఘ్నేశ్వర చరిత్రలో ఇది సుందరకాండ!’’ అంటూ వెన్నతో చేసిన తినుబండారాల్ని కృష్ణుడి నోట కుక్కాడు. పళ్ళాలు ఖాళీ అవుతున్నాయి.

యశోద పూజామందిరానికి వస్తూ గవాక్షం గుండా లోపల జరుగుతున్న సుందరకాండ చూసి కొయ్యబారిపోయింది. ముచ్చెమటలు పట్టాయి. మళ్ళీ తమాయించుకొని, ‘‘అబ్బే, నేనేదో భ్రమపడుతున్నాను, నా కళ్ళకేదో మాయతెగులు పట్టుకుంది!’’ అని సర్ది చెప్పుకుంటూ తలుపు తెరిచి వచ్చింది.

వినాయక విగ్రహం విగ్రహంలాగే ఉన్నది. అమర్చిపెట్టిన తినుబండారాలు కనిపించటం లేదు. కృష్ణుడు బిక్కమొహంపెట్టి చూస్తున్నాడు.

"నీ తిండితగలడా! పూజ కాకుండా అంతా పాడుచేశావు," అంటూ యశోద కృష్ణుడి వీపు మీద గట్టిగా నాలుగు చరిచింది.

కృష్ణుడు ఏడుస్తూ, ఎవరికీ చిక్కకుండా పరుగు తీసి, కాళిందిమడుగు చేరాడు. ఆ వెనుకనే యశోదతోబాటు గోకులంలోని వారంతా ఆదుర్దాగా వెళ్ళారు.

కాళిందిమడుగులో ఉంటున్న కాళీయ మహాసర్పం వల్ల గోకులవాసులకు ఎన్నో విధాలుగా హాని జరుగుతూ వస్తున్నది. కృష్ణుడు మడుగు ఒడ్డునే ఉన్న చెట్టెక్కి, మడుగు మధ్యకు వ్యాపించి ఉన్న కొమ్మ మీది నుంచి, మడుగులోకి దూకి, కాళీయనాగుడినెత్తిమీద పిడుగులాగ పడ్డాడు. గజ్జెలందెలు ఘల్లు ఘల్లుమనగా కృష్ణుడు కాళీయుడి తలలమీద తాండవం చేశాడు. అద్భుతంగా కాళీయమర్దనంజరిగింది. కాళీయుడి శాపం తీరింది. కుమార్తెలను తీసుకెళ్ళి పాతాళంలో వాసుకికి అప్పగించి, కాళీయరూపం ఉపసంహరించుకొని, విఘ్నం విఘ్నేశ్వరుడి అధీనమైంది.

కొడుకునెత్తుకొని యశోద ఇంటికొచ్చి చూసేసరికి, పూజామందిరంలో పళ్ళాలన్నీ నిండుగా ఎలాగ పేర్చినవి అలాగే ఉన్నాయి. బాలకృష్ణుడి వీపుమీద మాత్రం యశోద వ్రేలి తట్టు కనిపిస్తున్నాయి. యశోద వాటిని చూసి, "నా చేతులు పడిపోను! నా కళ్ళకేదో మాయరోగం వచ్చి నిష్కారణంగా కొట్టాను. పాపిష్ఠి దాన్ని!" అని వలవలా ఏడ్చింది.



‘‘అమ్మా! బోలెడు వేళ ఉంది, పూజ చెయ్యవూ మరి!’’ అన్నాడు కృష్ణుడు. నందుడు యశోద కృష్ణుడిచేతే పూజ చేయించారు. నైవేద్యాల్ని స్వయంగా ఊరందరికీ పంచారు. కమ్మని ఆ తినుబండారాల్లో అమృతం ఉందనిపించింది. గోకులమంతా ఆనందం పొంగి పొర్లింది.

కృష్ణుడు బాగా యెదిగాడు. గోవర్ధనగిరిని ఎత్తి ప్రళయభీకరమైన జడివాన నుంచి గోవులనూ, గోపకులనూ కాపాడి, ఇంద్రుడికి గర్వ భంగం చేశాడు.

గోవర్ధన ప్రాంతంలో ఒకనాడు కృష్ణుడు ఆవులను కాస్తుండగా, చంకను పెద్ద మద్దెల పెట్టుకొని, వస్తున్న ఒకపెద్దమనిషి, ‘‘అబ్బాయీ, ఇక్కడ కృష్ణుడు అనే అబ్బాయి ఉన్నాడట. మురళి చాలా గొప్పగా వాయిస్తాడని చెప్పుకుంటున్నారు. ఆ మురళీగానం ఏపాటిదో చూద్దామని వచ్చాను. అతడి ఉనికి చెప్పగలవా?’’ అన్నాడు కృష్ణుడితో.

‘‘స్వామీ, ఆ కృష్ణపరమాణువును నేనే! తమరెవరో చాలా గొప్ప మృదంగ విద్వాంసుల్లాగ ఉన్నారు. తమరెవరో తెలియనివాణ్ణి, కాస్త సెలవియ్యండి, స్వామీ!’’ అని కృష్ణుడు చేతులు జోడిస్తూ అన్నాడు.

‘‘నన్ను మృదంగకేసరి అని పిలుస్తారు. మాది దక్షిణదేశం. మధురానగరానికి వెళ్తున్నాను. కంసుడు ధనుర్యాగం చేస్తాడుట. అప్పుడు నా మద్దెల విద్వత్తును ప్రదర్శిద్దామని వెళ్తున్నాను,’’ అన్నాడు మృదంగకేసరినని చెప్పుకొన్న పెద్దమనిషి.

అతని కాలికి రత్నఖచితమైన గండపెండేరం, చేతులకు కెంపులు తాపినసింహతలాటాలు, మెడలో బంగారు నిమ్మకాయల దండ, చెవులకు పెద్ద కుండలాలు ధగధగా మెరుస్తున్నవి. మద్దెల నిండా నవరత్న స్వర్ణ పతకాలు తాపి ఉన్నవి.

కృష్ణుడు వాటిని చూసి అబ్బురపడుతూ, ‘‘స్వామీ, నేను ఆవుల్ని కాసే సామాన్య గోపకుణ్ణి. నా పిల్లనగ్రోవి సాదా వెదురుబొంగు ముక్క! మీ దక్షిణదేశ విద్వాంసులు, తాళానికి ప్రసిద్ధులు. ఇహనేను ఏదో ఒక రాగాన్ని ఊది, ఆవుల్ని పాలించుకోవడం తప్పితే, మరేదీ తెలియని గాలి పాటగాణ్ణి మాత్రమే!’’ అన్నాడు.





# ఉపకారి

శంఖవరం అనే గ్రామంలో, రంగడనే ఇరవైఏళ్ళ వయసువాడొకడుండేవాడు. వాడితల్లిదండ్రులు బాల్యంలోనే పోవడంతో, వాణ్ణి, అవ్వ పెంచి పెద్దచేసింది. వాడు పెద్ద సోమరి, ఏ పనీ అబ్బ లేదు. ఏదో ఒకనాడు అదృష్టదేవత తనను కరుణించి, పెద్ద ధనవంతుణ్ణి చేస్తుందని పగటి కలలు కంటూండేవాడు.

ఇరుగుపొరుగు ఇళ్ళల్లో పనులు చేసి, వాళ్ళిచ్చే డబ్బులతో కాలం గడుపుకు వస్తున్న అవ్వకు ఒకసారి జబ్బు చేసింది. ఆమె రంగడికి తన పరిస్థితి చెప్పి, ''ఒరే, నువ్వు అడవికి పోయి కట్టెలు కొట్టి తీసుకురా. అవి అమ్మగా వచ్చిన డబ్బులతో నాలుగైదు రోజులపాటు ఏ కలో గంజో తాగుదాం,'' అని గట్టిగా చెప్పింది.

చేసేది లేక రంగడు గొడ్డలి భుజాన పెట్టుకుని అడవికి వెళ్ళాడు. అక్కడ వాడు చెట్లల్లో తిరుగుతూ, ఒకచోట ఎండుకొమ్మలు కొట్టి మోపు కడుతూండగా, చెట్టుమొదట్లో తళతళ మెరుస్తున్న ఒక తీగ కనిపించింది. అలాంటి దాన్ని వాడు లోగడ చూసి వుండలేదు. వాడు ఆశ్చర్యపడుతూ, తీగను తెంపి తీసుకుని, దీనిని అవ్వకు చూపించాలి అనుకుంటూ, మొలలో దోపుకుని, కట్టెల మోపుతో ఇంటికి బయలుదేరాడు.

రంగడికి అడవి కాలిబాట పక్కన, కదలా మెదలక పడివున్న ఒక స్త్రీ, పక్కన దుఃఖంలో వున్న ఒక మగవాడూ కనిపించారు. వాడు వాళ్ళను సమీపించి మగవాణ్ణి సంగతేమిటని అడిగాడు. అతడి పేరు ధనంజయాచారి. సూరంపూడి అనే గ్రామంలోనే కాక, చుట్టు పక్కల కూడా ఎంతో పేరుమోసిన గొప్ప వైద్యుడు. తన దగ్గరకు చికిత్సకోసం వచ్చిన రోగులకు, వాళ్ళు పేదవాళ్ళయితే ఉచితంగా చికిత్స చేసేవాడు. ధనవంతులైతే, వాళ్ళిచ్చిన

జి. కృష్ణకుమారి



దేదో పుచ్చుకునేవాడు. ఆ కారణంగా, అతడు కూడబెట్టిన ఆస్తిపాస్తులంటూ ఏమీ లేవు.

ఒక్కొక్కసారి, దూరగ్రామాల నుంచి వచ్చే రోగులు, తగిన సమయంలో వైద్యచికిత్స అందని కారణంగా, అతడి దగ్గరకు వచ్చేసరికే ప్రాణాలు కోల్పోతూండేవారు. ఈ పరిస్థితికి ఎంతో విచారగ్రస్తుడైన ధనంజయాచారి, గ్రామ గ్రామానవైద్యశాలలు వుంటే, రోగులకు ఎంతో సౌకర్యంగా ఉంటుందని ఆలోచిస్తూండేవాడు.

ఇలాంటి సమయంలో, ఒకగొప్ప సాధువు, అతడి గ్రామానికి వచ్చి, ధనంజయాచారి ఇచ్చిన ఆతిథ్యానికి చాలా సంతోషించి, ఏదైనా కోరిక వుంటే కోరుకోమన్నాడు. ధనంజయాచారి, తన ఆలోచన గురించి సాధువుకు చెప్పి, ''స్వామీ, గ్రామాల్లో వైద్యశాలలుంటే, అస్వస్థతకు గురైనవాళ్ళకు వెంటనే తగిన చికిత్స చేసే అవకాశం వుంటుంది,'' అన్నాడు.

దానికి సాధువు నవ్వి, ''నీబోటి ఉపకార బుద్ధిగల వాళ్ళకు అలాంటి వైద్యశాలలు నిర్మించే తాహతులేదు కదా, రాజులాంటి వాడు పూనుకోవాలి!'' అని ఒకటి రెండు క్షణాలు మౌనంగా వుండి, ''ఐతే, ఒక పని చెయ్యి. రెండు రోజుల్లో రాజుగారి జన్మదినం రాబోతున్నది. అప్పుడు జరిగే వేడుకల్లో, ఆయనకు ఒక విలువైనరత్నం బహూకరించు. నేను, నీకు రాయిని రత్నంగా మార్చే వరం ఇస్తాను. తర్వాత ఆయనకు, వైద్యశాలల నిర్మాణం గురించిన, నీ కోర్కె వివరించు, ఫలితం తప్పక వుంటుంది,'' అని, ధనం జయాచారికి వరం ఇచ్చి వెళ్ళిపోయాడు.

ధనంజయాచారి, భార్యను వెంటబెట్టుకుని రాజధానికి బయల్దేరాడు. దారిలో అడవి మార్గాన భార్య పాముకాటుకు గురై అరగంట క్రితం నుంచి మరణావస్థలో వున్నది.

ధనంజయాచారి చెప్పినదంతా శ్రద్ధగా విన్న రంగడు, ''రాయిని రత్నంగా మార్చే వరమా?'' అంటూ ఆశ్చర్యపోతున్నంతలో, ధనంజయాచారికి, వాడి మొలనుంచి తళతళ మెరుస్తూ వేళ్ళాడుతున్న తీగ కనిపించింది.

అతడు దాన్ని చూస్తూనే అబ్బురపడి పోతూ, ''ఆ మెరిసే మహత్తరమైన మూలిక నీకెక్కడ దొరికింది? అడవిలో ఇలాంటి వాటిని వెతికి సంపాయించడం చాలా కష్టసాధ్యం. ఆ మూలికను ఇచ్చావంటే, విషం తలకెక్కి చావుకు దగ్గరవుతున్న, నా భార్యను కాపాడుకుంటాను,'' అన్నాడు.

''మరి ఈ మూలికను నీకిస్తే, నాక్కలిగే లాభమేమిటి?'' అన్నాడు రంగడు ఎంతో ఆశగా.

"రత్నాన్ని రాజుగారికి కానుకగా ఇచ్చి, ఆయన నాకు బహూకరించే ధనంలో నీకు సగం ఇస్తాను. అట్లని ప్రమాణం చేస్తున్నాను," అన్నాడు ధనంజయాచారి.

రాజుగారికి రత్నం ఇచ్చి, అప్పుడాయన నుంచి పొందే మొత్తం బహుమాన ధనాన్ని తానే వుంచుకోవాలని రంగడికి ఆశపుట్టింది. వాడు, తను ఆ మూలికను ఇచ్చేముందు రాయిని రత్నంగా మార్చి తనకివ్వమన్నాడు. ధనంజయాచారి సమీపంలోవున్న ఒక రాయిని, సాధువు ఇచ్చినవరప్రభావంతో రత్నంగా మార్చి రంగడికిచ్చాడు. రంగడు దాన్ని తీసుకుని, మూలికను ధనంజయాచారి పరంచేశాడు.

ఆ వెంటనే ధనంజయాచారి మూలికను తను వెంట తెచ్చుకున్న మరచెంబులోవేసి, ఒకటి రెండు నిమిషాల తర్వాత దాన్ని బయటికి తీసి, చెంబులో వున్న నీళ్ళను కొద్దిగా భార్య నోట్లో పోశాడు. కొద్దిసేపట్లో ఆమె కళ్ళు తెరిచి, చుట్టూ ఒకసారి చూసి లేచి కూర్చున్నది.

భార్య ప్రాణాపాయం నుంచి బయటపడినందుకు ధనంజయాచారి పరమానందం చెంది రంగడితో, "నేను ఒక పరోపకారం కోసం, రాజుగారి నుంచి ధను బహుమానంగా పుచ్చుకోవాలనుకుంటున్నాను. ఆ సంగతి ఇంతకు ముందే నీకు చెప్పాను. వ్యాధిగ్రస్తులకోసం వైద్యశాలలు నిర్మించడం. అందువల్ల, రాజుగారిచ్చే బహుమానంలో సగం నాకివ్వాలి, గుర్తుంచుకో!" అన్నాడు.

"అలాగే తప్పక ఇస్తాను," అంటూ రంగడు అబద్ధం ఆడి, కొంతదూరం పోయి కట్టెల మోపును దూరంగా పారవేసి రాజధానికి బయల్దేరాడు. ధనంజయాచారి కూడా,



భార్యకు మరికాస్త స్వస్థత కలిగాక రాజధానికి బయలుదేరాడు. ఆయన ఉద్దేశం రంగడికి లభించే బహుమానంలో సగం తీసుకోవడం, వీలైతే రాజుగారిని కలిసి, గ్రామాల్లో వైద్యశాలలు నిర్మించవలసిన అవసరం గురించి, ఆయనకు విన్నవించడం.

వాళ్ళు నగరం చేరేసరికి అంతా కోలాహలంగా వున్నది. ఎక్కడెక్కడినుంచో ప్రముఖులైన అతిథులు చాలామంది వచ్చారు. రాజుగారిని ఆశీర్వదించడానికి కొందరు సాధువులు కూడా ఆహ్వానింపబడ్డారు. వారిలో ధనంజయాచారికి వరం ఇచ్చిన సాధువు కూడా ఉన్నాడు.

రంగడు ఒకటి రెండుసార్లు ధనంజయాచారికి ఎదురుపడినా ఏమీ గుర్తించనట్టు ముఖం చాటేసుకుని తప్పుకుపోయాడు. దీనితో రంగడి దురుద్దేశం పసికట్టిన ధనం

జయాచారి, జరిగినదంతా సాధువుకు చెప్పు కున్నాడు. అంతా విని సాధువు తల పంకించి వూరుకున్నాడు.

రాజుగారు తనను అభినందించవచ్చిన వారితో సభ ఏర్పాటు చేసి, కొంతసేపు ప్రసంగించిన తర్వాత, అతిథులు తమ శక్తికొద్దీ తెచ్చినకానుకలను ఆయనకు సమర్పించారు. ఆయన, వాళ్ళు తనపట్ల చూపుతున్న గౌరవానికి సంతోషించి, వాళ్ళకు బంగారు నాణాలూ, విలువైన వస్తువులూ ప్రతిఫలంగా ఇవ్వసాగాడు. రంగడు, రాజుగారిని సమీపించి తను తెచ్చిన రత్నాన్ని ఆయనకు కానుకగా ఇచ్చాడు.

విచిత్రంగా, ఆ రత్నం రాజుగారు తీసుకోగానే, బరువైనరాయిగా మారి చేజారి ఆయన పాదాల మీద పడింది. ఆయన కాలివేళ్ళకు గాయమై రక్తం కారసాగింది. రాజుకు తీవ్రమైన ఆగ్రహం కలిగి, రంగడిని బంధించమని భటులను ఆజ్ఞాపించాడు.

రంగడు ఇలా ఎందుకు జరిగిందో అర్థం కాక, దగ్గరలోవున్న ధనంజయాచారికేసి, రక్షించమన్నట్టు చూశాడు. జాలిగుండెగల ధనంజయాచారి, సాధువు కోసం తల తిప్పగానే, ఆయన ముందుకు వచ్చి రంగడితో,

"రంగా, నీకు అనాయాసంగా లభించిన మూలికను, ధనంజయాచారికిచ్చి సహాయం చేయడానికి, ఆయన భార్య ప్రాణాలకు బేరు పెట్టావు. నువ్వు రాజుగారిచ్చే బహుమానంలో, ధనంజయాచారికిస్తానన్న సగం భాగం ఎగగొట్టాలని ఆలోచించావు. అందుకనే, రాజుగారిచ్చే బహుమతికి నువ్వు అర్హుడివి కాదని, రత్నాన్ని రాయిగా మార్చాను," అన్నాడు.

రంగడు కళ్ళనీళ్ళు పెట్టుకుని సాధువు కాళ్ళమీద పడ్డాడు. ఆ మరుక్షణం రాయి రత్నంగా మారిపోయింది. రాజుగారు దాన్ని చూసి చాలా మెచ్చుకుని, ధనంజయాచారి వచ్చినపని గురించి విన్నాడు. దానితో ఆయనకు రాజ్యంలో ప్రజలకు సరైన వైద్య సౌకర్యాలు లేవని తెలిసిపోయింది.

ఆయనమంత్రిని పిలిచి, ప్రతి గ్రామానా, అది సాధ్యపడకపోతే మూడు నాలుగు గ్రామాలకు కలిపి ఒక వైద్యశాల ఉండేలా చూడమని చెప్పి, వాటిపై పర్యవేక్షణాధికారిగా ధనంజయాచారిని నియమిస్తూ; దురాశాపరుడైనా, ఒకవిధంగా ప్రజల మేలుకు సాయపడిన రంగడికి రాజభటుడుగా ఉద్యోగం వేయించాడు.





# వ్యాపార బాధ్యత!

తాళ్ళపల్లి అనే ఊళ్ళో, నాంచారయ్య పేరు ప్రతిష్ఠలతోపాటు డబ్బు కూడా బాగా సంపాదించినవ్యాపారి. అయితే,ఆయనకు వయసు పైబడుతున్నట్లనిపించింది. ఇక వ్యాపార బాధ్యతలను, తన ముగ్గురు కుమారులలో ఏ ఒక్కడికో అప్పగించాలనే ఆలోచనతో, ఒక రోజున వాళ్ళను దగ్గరకు పిలిచి, ''చూడండి, నా వ్యాపారాన్ని మీ ముగ్గురికీ పంచి ఇవ్వడం కన్నా, మీలో తగిన అర్హత కలవాడికి అప్పగించడంవల్ల, ఆస్తికి తగిన భద్రత వుంటుందని భావిస్తున్నాను. అయితే, మీలో ఎవరు అందుకు అర్హులో నిర్ణయించడానికి, మీకు ఒకచిన్న పరీక్ష పెట్టదలిచాను, ఏమంటారు?'' అని అడిగాడు.

అందుకు వాళ్ళు అంగీకారంగా తలలూపగానే, నాంచారయ్య తన జేబులో నుంచి మూడు రూపాయి నాణేలను తీసి, ఒక్కొక్కరికి ఒక నాణేన్ని ఇస్తూ, ''ఈ రూపాయితో సాయంకాలానికల్లా ఏదైనా ఒక మంచిపని చేసి రండి!'' అన్నాడు.

అన్నదమ్ములు మారుమాట చెప్పకుండా మౌనంగా బయటకు నడిచారు. వాళ్ళు తమ తండ్రిపట్ల ఎంతో గౌరవం, చాలా వినయ విధేయతలు కలవాళ్ళు.

ఆ రోజు సాయంత్రం బజారు నుంచి తిరిగి వచ్చిన నాంచారయ్య, ముగ్గురు కొడుకులూ తనకోసం ఇంట్లో నిరీక్షిస్తున్నట్టు గమనించాడు. ముందుగా పెద్దకొడుకు సోమశేఖరాన్ని దగ్గరికి పిలిచి, ''నీవు నేనిచ్చిన రూపాయితో చేసిన మంచి పని ఏమిటి?'' అని అడిగాడు.

సోమశేఖరం సంతోషంగా, ''రామాలయం సమీపంలో ఆకలితో కొట్టుమిట్టాడుతున్న ఒక వృద్ధురాలిని చూశాను. ఆ రూపాయితో

కోలపల్లి ఈశ్వర్

ఏదైనా కొనుక్కు తినమని ఆవిడకిచ్చాను. సాటిమనిషి ఆకలి తీర్చడం మంచి పనే కదా!'' అన్నాడు.

నాంచారయ్య చిరునవ్వు నవ్వి, రెండవ కొడుకైన రామబ్రహ్మాన్ని, ''నీవేం చేశావు?'' అని అడిగాడు.

రామబ్రహ్మం కొద్దిగా గర్వంగా చూస్తూ, ''మన వ్యాపారం మరింతగా అభివృద్ధి చెందాలని గుడిలో పూజ చేయించాను. పూజారికి ఆ రూపాయి ఇచ్చాను,'' అన్నాడు.

తర్వాత, నాంచారయ్య మూడవకొడుకు నారాయణను పిలిచి, ''నీ సంగతేమిటి?'' అని అడిగాడు.

నారాయణ మౌనంగా తన జేబులోంచి రూపాయి నాణెం తీసి, తండ్రి ముందు ఉంచాడు.

దానిని చూసి, ''అయితే, నువ్వేమీ చేయలేదా? రూపాయిని ఖర్చు చేయకుండా తిరిగి వచ్చి, దాన్ని పొదుపు చేశావన్నమాట!'' అన్నాడు నాంచారయ్య.

నారాయణ చిన్నగా నవ్వి, ''డబ్బును వృథాగా ఖర్చు చేయడం, మీకిష్టముండదని నాకు తెలుసు. అయితే, నేను డబ్బును ఖర్చు చేసి, ఒక మంచి పని చేశాను. అంతే కాకుండా మీరిచ్చిన డబ్బును కూడా కాపాడాను,'' అన్నాడు.

అర్థంకానట్టు కొడుకుకేసి చూశాడు, నాంచారయ్య.

''నాన్నా, మీరిచ్చిన రూపాయితో మూడు గుమ్మడికాయలు కొన్నాను. బజారులో ఒక అంగడి పక్కన కూర్చుని, ఆ మూడు గుమ్మడి కాయలనూ చాలా ప్రశస్తమైనవని చెప్పి, రెండు రూపాయలకు అమ్మాను. లాభంగా వచ్చిన రూపాయితో అర్ధరూపాయికి అటుకులు కొని, ఆకలితో బాధపడుతున్న ఒక పిల్లవాడికి పెట్టి, మిగిలిన అర్ధరూపాయిని దేవుడి హుండీలో వేశాను. మిగిలిన రూపాయిని మీకిచ్చాను,'' అన్నాడు నారాయణ నవ్వుతూ.

కొడుకు దూరదృష్టికీ, చొరవకూ, దయాగుణానికీ ఆశ్చర్యంతోపాటు ఆనందం కూడా పొందిన నాంచారయ్య, అప్పటికప్పుడు తన వ్యాపార బాధ్యతలు నారాయణకు అప్పగించాడు.





# బుద్ధి రవాణా

చిత్రపురి ఒక చిన్న రాజ్యం. యువరాజు చిత్రవర్మ కొత్తగా రాజ్యానికి వచ్చి పరిపాలిస్తున్న రోజులవి. చిత్రవర్మకు రాజ్యపాలనలో అంతగా అనుభవం లేకపోయినా బుద్ధిమంతులు, సమర్థులు అయిన మంత్రులు, తదితర రాజోద్యోగుల సాయంతో రాజ్యాన్ని పాలిస్తూ వుండేవాడు.

చిత్రపురి రాజ్యాన్ని ఆనుకునే అంగ రాజ్యం వుండేది. అది అన్నివిధాలా చిత్రపురి కన్నా పెద్దది. దానికి వర్ధనుడు రాజు. అతడికి ఎన్నాళ్ళుగానో చిత్రపురిని జయించి తన రాజ్యంలో కలుపుకోవాలని కోర్కె వుండేది. చిత్రవర్మ తండ్రి రాజుగా ఉన్నంతకాలం ఆ కోర్కె ఫలించలేదు. ప్రస్తుతం చిత్రవర్మ ఆ రాజ్యానికి రాజు. అతనికి ఇంకా బాగా రాజకీయాలూ, యుద్ధ మెళుకువలూ, తెలిసి వుండవని వర్ధనరాజు ఊహించాడు.

ఒక దినం మంత్రులను పిలిపించి, తన కోర్కెనూ, ఊహలనూ చెప్పి, వారి సలహా కోరాడు. దానికి వారు సంతోషించి ఇలా చెప్పారు: ''మీ ఊహ సరి అయినది. ఈ సమయంలోనే చిత్రపురిని జయించడానికి అవకాశాలున్నవి. ఎంతైనా ప్రత్యర్థి యొక్క బుద్ధిబలాలు తెలుసుకొననిదే కయ్యానికి కాలుదువ్వ రాదు. కనుక చిత్రపురి రాజోద్యోగుల బుద్ధిబలాన్ని ముందుగా పరీక్షించి తెలుసుకోవాలి.''

''ఆ పరీక్ష ఏదో వెంటనే నిర్వహించండి,'' అని వర్ధనుడు అమాత్యులను ఆదేశించాడు. వారు అందరూ కలిసి మంత్రాలోచనము చేసి, ఒక లేఖ వ్రాసి వర్ధనుడికి ఇచ్చి, ''దీనిని చిత్రవర్మకు పంపించండి. సమాధానం ఏమి వస్తుందో చూసుకొని మిగతా విషయాలు ఆలోచిద్దాం,'' అని చెప్పారు.

ఆ లేఖలో ఇలా వ్రాసి వుంది: ''మీ రాజ్యం నుంచి కొంత బుద్ధిని రవాణాచేసి మాకు పంపించాలి.''

చిత్రవర్మకు ఆ లేఖ, వర్ధనుడి రాయబారి ద్వారా అందింది. అది చదివి అతడు ఆశ్చర్యపోయాడు. అమాత్యులకు చూపించాడు.



వారుకూడా ఆశ్చర్యపోయారు. మంత్రులు రాజుతో సమావేశమైనారు. వారికి వర్ధనుడి కోర్కె వింత గొలిపింది. ఏదైనా వస్తువులూ, సామగ్రీ అయితే రవాణా చేయవచ్చును. అదృశ్య వస్తువులను ఎలా పంపటం? తమ బుద్ధి చాతుర్యాలను పరీక్షించడానికి వర్ధనుడు ఈ పరీక్ష పెట్టి ఉంటాడని అమాత్యులందరూ అర్థం చేసుకున్నారు.

చిత్రవర్మ చాలా కళవళ పడిపోయాడు. ఆసమయంలోఅందరిలోకిచిన్నవాడైనమంత్రి బృహస్పతి లేచి, ''రాజా! నాకు ఒక నాలుగు నెలల పాటు గడువు ఇప్పించండి. వర్ధనరాజు కోరినట్టు బుద్ధి రవాణా చేస్తాను. అయితే ఈ విషయమై నన్ను, మీరు ఈ నాలుగు నెలలూ ఏమీ ప్రశ్నించవద్దు,'' అన్నాడు.

చిత్రవర్మ సంతోషంగా అతను కోరిన గడువు ఇచ్చాడు. వర్ధనుడికి, ''మీరు కోరిన విధంగా బుద్ధి రవాణా చేస్తాము! కానీ నాలుగు మాసాలు గడువు కావాలి,'' అని లేఖ పంపాడు.

నాలుగు నెలలు దాదాపుగా గడిచిపో వచ్చినవి. ఒక దినం బృహస్పతి, ఒక పెద్ద మూటతో సహా, మంత్రుల రహస్య సమావేశ మందిరంలోకి ప్రవేశించాడు. అతడు రాజు వైపు తిరిగి, ''మహారాజా! ఈ మూటలోనే వర్ధనుడు కోరిన ''బుద్ధి'' వుంది. జాగ్రత్తగా, మూటకు దెబ్బ తగలకుండా వెంటనే వర్ధన రాజుకు పంపే ఏర్పాట్లు చేయండి,'' అన్నాడు. ఆ మూట చాలా జాగ్రత్తగా కట్టబడి వుంది. దానిలో ఏముందోనని ప్రతి ఒక్కరికీ అను మానంగా వుంది. కానీ ఎవరూ ఏమీ అడగ లేదు. చిత్రవర్మకూడా ఏమీప్రశ్నించకుండానే ఆ మూటను అంగరాజ్యానికి పంపించాడు.

వర్ధనుడు, అతని మంత్రులు మూటను జాగ్రత్తగా విప్పారు. అందులో ఒక సన్నటి మూతిగల కుండ వుంది. దానిలో పెద్ద గుమ్మడికాయ ఒకటి ఉంది. ఆ గుమ్మడి కాయ సరిగ్గా, సందు లేకుండా కుండలో ఇమిడిపోయి వుంది. తొడిమ మాత్రము కుండ మూతిలో నుంచి బయటకు వచ్చి వున్నది. కుండకు ఎక్కడా పగుళ్ళుకానీ, బీటలుగానీ లేవు. అది కొత్త కుండ. ఇది చూసి వర్ధనుడికి, అమాత్యులకు అమిత ఆశ్చర్యం కలిగింది. ఆ కుండ మూతికి ఒక ఉత్తరం కట్టబడివుంది. దాన్ని ఆత్రుతగా విప్పి చదివాడు వర్ధనుడు: ''వర్ధనులవారు కోరినట్లు 'బుద్ధి'ని పంపించాము. ఈ కుండలోపల బుద్ధి వుంది. కుండపగులగొట్టకుండా మీరుగుమ్మడి కాయను వెలికి తీసుకోండి. ఈ కానుకఅందిన వెంటనే తెలియపరచవలెను.''

ఒకరినొకరు చూసుకొని స్తబ్ధులైనారు రాజూ, మంత్రులూ. వారికి పెద్ద సందేహం కలిగింది. ఇంత చిన్న మూతిగల కుండలోనికి, అంత పెద్దది, సరిగ్గా కుండలోకి ఇమిడిపోగల గుమ్మడికాయ ఎట్లా దూరింది? అందులోకి ఎట్లా పట్టగలిగింది? పైగా కుండ పగుల గొట్టకుండా గుమ్మడికాయను బయటకు తీసుకోవాలట. అదే 'బుద్ధి' అట! నిజానికి ఇది అసాధ్యం! అందరూ మౌనం దాల్చి, తలలు వంచారు. ఆఖరికి వర్ధనుడు అమాత్యులను ఉద్దేశించి ఇలా అన్నాడు: ''మనము అనుకు న్నంత తెలివి తక్కువవారు కాదు మన ప్రత్య ర్థులు. ఇంత బుద్ధిబలం కలిగినవారితో కయ్యం కంటే, స్నేహమే మేలు.'' వెంటనే ఆయన చిత్రవర్మకు ఈ విధంగా కబురు పంపించాడు: ''మీరు పంపిన కానుక అంది నది. మిమ్ములను ఈ తరుణంలో ప్రశంసించ కుండా వుండలేకపోతున్నాను. మీ స్నేహ, సౌహార్దాలను కాంక్షిస్తున్నాను.''

ఈ వర్తమానం అందుకొని చిత్రవర్మ అత్యంతానందం పొందాడు. అతడికి, 'వర్ధనుడు అడిగిన 'బుద్ధి' ఎట్లా చేరింది?' అని ఆశ్చర్యం కూడా కలిగింది. బృహస్పతిని పిలిపించి, మనస్ఫూర్తిగా అభినందించి గౌరవించి, ''అమాత్యా! మీరు చేసిన పని, నా గౌరవాన్ని నిలబెట్టి, మన రాజ్యానికి ప్రతిష్ఠ ప్రసాదిం చింది. అసలు ఇంతకూ తమరు ఏమిచేశారో శలవిస్తారా?'' అని అడిగాడు.

దానికి బృహస్పతి ఇలా సమాధానం చెప్పాడు:

''ఇందులో నేను పెద్దగా చేసినదేమీ లేదు. నాలుగు మాసాల క్రితం నేను గుమ్మడి తీగను వేసి పెంచాను. కొద్ది రోజులకు అది పుష్పించి, చిన్న పిందెలు వేసింది. ఒక చిన్న పిందెను, సన్న మూతి గల ఒక కుండలో వుంచి, జాగ్రత్తగా పోషించాను. ఆ గుమ్మడిపిందె కుండలోనే పెరిగి పెద్దదయింది. బాగా కుండలో సరిగ్గా ఇమిడే టంతటి పెద్దదికాగానే తొడిమదగ్గరకోసి, కుండను గుమ్మడి కాయతో సహా జాగ్రత్తగా మూటకట్టి, మీ ద్వారా దానిని వర్ధనులవారికి పంపాను. కుండను పగులగొట్టకుండా గుమ్మడి కాయను తీసుకోమనీ, అదే వారు కోరిన ''బుద్ధి'' అనీ ఒక లేఖ కూడా వ్రాసి పంపాను. ఇక దానికి వారి నుంచి వచ్చిన సమాధానం మీకు తెలిసినదే.''



ఇదొక చందమామ కానుక!

# అజేయుడు గరుడుడు! 22

చిత్రాలు: పాణి.

ఆదిత్యుడు రాజు మహేంద్రవర్మ ఆశీస్సులు పొంది, సైనికులను వెంటబెట్టుకుని తాంత్రికుడు నాగబంధు అటకట్టించడానికి సర్ప దేశానికి బయలుదేరాడు. తాంత్రికుడి గుహాలయానికి దూరంగా గుడారాలు నిర్మించుకున్న ఆదిత్యుడి అనుచరులు కోయ యువతీయువకుల జంటను బంధించి తెచ్చారు. తంత్రవేత్త బారినుంచి తప్పించుకుని పారిపోతూన్న వారిని ఆదిత్యుడి అనుచరులకు పట్టుబడ్డారు. తాంత్రికుడు బలి ఇవ్వడానికి వెతుకుతూన్న ఆదిత్యుడు తానేనని, ఆదిత్యుడు వారికి తెలియజెప్పాడు.

కోయ యువతీయువకులు అమితాశ్చర్యం చెందారు. ఆ యువతి, తాంత్రికుడికి ఉన్న అద్భుతశక్తులను గురించి ఆదిత్యుడికి తెలియజేసింది. ఆదిత్యుడి సాహసకృత్యాల గురించి నరేంద్రదేవుడి మనుషులద్వారా తాము ఇంతకు ముందే విన్నామని కూడా ఆమె చెప్పింది.










కొందరు కోయవాళ్ళు వచ్చి ఆదిత్యుడికి తమ బాధలు విన్నవించుకున్నారు.


మీలో కొందరు వెళ్ళి అగ్నికుండాన్ని వెలిగించి దానిచుట్టూ నాట్యం చేయండి. ఆ చప్పుడు విని తాంత్రికుడు వెలుపలికి రాగలడు!
కోయవాళ్ళు సంతోషించారు.
ఈయన మన రక్షకుడు!


నరేంద్రదేవుడు తన అనుచరులతో అక్కడి నుంచి బయలుదేరడానికి సిద్ధమయ్యాడు.
నేను బయలుదేరే ముందు తంత్రవేత్త నాగబంధును దర్శించి ఆయన్ను చంద్రపురికి ఆహ్వానించాలి.
అయినా, ఆశాభంగం ఎదురయింది.
ఆయన విశ్రాంతి తీసుకుంటున్నాడు. నిద్రాభంగం కలిగించకూడదు. నేనే ఆయన్ను చంద్రపురికి పిలుచుకువస్తాను. విచారించకు.


ఆ నీచుడు గరుడుడు ఎక్కడ దాగాడో అంతు బట్టడం లేదు!
నరేంద్రదేవుడికి కోయల నాయకుడే ముందుండి దారి చూపాడు.
మనం ఇప్పుడు ఎటు వెళుతున్నాం?
కొండ పాదతలానికి ఇదే దగ్గరి దారి ప్రభూ! మనం త్వరలోనే అక్కడికి చేరుకుంటాం!


అక్కడ ఆదిత్యుడి అనుచరులు కొందరు, కోయ యువతీయువకులు దారి చూపగా, రహస్యమార్గం గుండా కొండ పాదాల వద్దకు చేరుకోవడానికి బయలుదేరారు.


ఉన్నట్టుండి గుహాలయం బయట చెలరేగిన కలకలం పాటలు, విని నాగబంధు మేల్కొన్నాడు.
అగ్నికుండం వెలుగుతోంది. ఆదిత్యుణ్ణి అందులో బలి ఇస్తే నీవు మరింత సంతోషించగలరు!


అక్కడ కొండ పాదతలంలో ఉన్న చిన్న నదిలో నరేంద్రదేవుడి కోసం అలకంరించబడిన పడవ సిద్ధంగా ఉంది. పడవ బయలుదేరే సమయంలో....
జాగ్రత్త ప్రభూ! ఈ నదిలో మొసళ్ళు ఉంటాయి!
ఇంకావుంది

# FUN వినోద TIMES సమయం

## కప్పపిల్లకు సాయపడండి!

కప్పపిల్ల తనను మింగడానికి ఉత్సాహంతో కాచుకుని ఉన్న పాములను తప్పించుకుని ఈ చిక్కుల దారిని దాటడం ఎలాగా అని బలంగా ఆలోచిస్తున్నది.







## రాహుల్ నీడ

పసిబిడ్డ రాహుల్ నేలమీద హుషారుగా దోగాడుతున్నాడు. అక్కడ మూడు నీడలున్నాయి. అందులో తన నీడేదో రాహుల్‌కు తెలియడం లేదు. ఈ మూడింటిలో అతని నీడను మీరు గుర్తించగలరా?



# దృశ్యంలో తప్పులు!

ఈ దృశ్యం చూడడానికి
రకరకాల జంతువులూ,
పక్షులూ హాయిగా
ఆడుకుంటూన్న చక్కటి
అడవి దృశ్యంలా కనిపిస్తున్నది.
అయితే, ఇందులో చాలా
తప్పులున్నాయి.
ఈ దృశ్యంలోని తప్పులేమిటో
కనుగొనగలరా?

(సమాధానాలు: 66 పేజీ)

# తేడాలు కనుగొనండి!

ఈ రెండు చిత్రాలూ చూడడానికి ఒకే విధంగా ఉన్నాయి. అయితే రెండింటి మధ్య ఎనిమిది తేడాలున్నాయి. కనుగొనండి చూద్దాం.





వ్యాఖ్యలు రాయండి!

# ఫోటో వ్యాఖ్యల పోటీ







ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్నవాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.

వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్టుకార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు ఫిబ్రవరి 2003సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ.100 బహుమానం.

ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, 82,డిఫెన్స్ఆఫీసర్స్ కాలనీ,
ఈకాట్టుతాంగల్, చెన్నయ్ - 600 097.

## అభినందనలు

అక్టోబర్ 2002 సంచికలో బహుమతి
పొందిన వ్యాఖ్యలు పంపినవారు:
ఎం. హెచ్. రావు
ఫ్లాట్ 5 బి
4 ఎ, రొనాల్డ్ షాయ్ రోడ్
అలిపూర్, కొల్‌కతా-700 027

ఫోటో వ్యాఖ్యల పోటీ:





మొదటిఫోటో: గోరంత దీపం కొండంత వెలుగు!
రెండవఫోటో: గౌరమ్మ పూజతో కష్టాలు తొలుగు!!

వినోద సమయం సమాధానాలు (పేజీ 64)

### తేడాలు కనుగొనండి!

1. అమ్ములపొది బాణాలసంఖ్య.
2. లక్ష్యంలోని వృత్తాలు.
3. దుస్తులమీది డిజైన్.
4. వెనక వున్న పర్వతాలు.
5. పక్షి తలమీది ఈకలు.
6. పిల్లవాడి తలపాగా మీది చుక్కలు.
7. పక్షి రెక్క ఆకారం.
8. చెమట బిందువుల సంఖ్య.

రాహుల్ నీడ-3

### దృశ్యంలో తప్పులు

చెట్టు బెరడును తొలుస్తున్న చిలుక; పగటిపూట గబ్బిలం; గడ్డి తింటూన్న పులి; కుందేలుతోక; మాంసం తింటూన్న కుందేలు; కంగారూ కడుపు సంచీలో కుక్కపిల్ల; కంగారూ తలపై కొమ్ములు.

Printed and Published by B. Viswanatha Reddi at B.N.K. Press Pvt. Ltd., Chennai - 600 026 on behalf of Chandamama India Limited, No. 82, Defence Officers Colony, Ekkatuthangal, Chennai - 600 097. Editor : Viswam

నా పిల్లలు నేను మంచి వంటగత్తెననీ, గొప్పడాక్టర్‌ననీ, చక్కని తల్లిననీ, కానీ పెట్టుబడి పెట్టడంలో ఏ మాత్రమూ నేర్పులేనిదానిననీ అంటూ వుంటారు. నా దగ్గర వున్న కాస్త డబ్బుని ఎలా ఎక్కువ చెయ్యాలో నాకు బొత్తిగా తెలీదు. అయితే, "దానిని కరూర్ వైశ్యా బ్యాంక్ వారి రెయిన్‌బో అకౌంట్‌లో వెయ్యండి" అని మా బ్యాంక్ మేనేజర్ సలహా ఇచ్చారు. అది ఫిక్సెడ్ డిపాజిట్‌లో లాగా వడ్డీ లభించే సేవింగ్స్ అకౌంట్. అందుకే నా డబ్బు ఇప్పుడు కొద్ది కొద్దిగా పెరుగుతోంది. "చూడు, నీకు సాధ్యమవుతుంది అమ్మా" అంది మా అమ్మాయి. అయితే అందుకు కారణం నిజంచెప్పాలంటే నేను కాదు.

అది, నా బ్యాంక్




20900 | అధిక రాబడుల పొదుపు ఖాతాలు | టెర్మ్ డిపాజిట్లు | వ్యక్తిగత రుణాలు | గృహ రుణాలు | విద్యా రుణాలు | నగలపై రుణాలు | లాకర్ సౌకర్యం | ది కరూర్ వైశ్యా బ్యాంక్ లిమిటెడ్, రిజిస్టర్డ్ ఆఫీస్ రోడ్, కరూర్ - 639 002.

